# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA . MADRAS. సంపుటం 41. సంచిక 178 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శుక్రవారం 1-10-1954 Reg. No.M. 1118 12 పేజీలు వెల 1 అణా

318906

# [illegible] దీక్ష తపోఫలం నవ్యాంధ్రలో నవజీవన అభ్యుదయం

## రాష్ట్రావతరణ వార్షికోత్సవం: వివిధ రంగాలలో సాధించిన విజయాలు

### ఆంధ్ర ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారి సమగ్ర సమీక్ష

నలభై సంవత్సరాలపాటు సాగిన తీవ్ర ఆందోళన ఫలితంగానూ, మహోగ్రతపస్వి, అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానం ఫలితంగానూ అవతరించిన ఆంధ్రరాష్ట్రం అపరిమితోత్సాహంతో ప్రప్రథమ జన్మదినోత్సవాన్ని జరుపుకొంటున్న శుభదినం నేడు. కొత్తగా ఏర్పడిన ఏ రాష్ట్రంలో నైనప్పటికీ దాని ఆర్థిక, సాంఘిక, రాజకీయ అభ్యుదయ వికాసాల కృషిని లెక్క కట్టవలసి వచ్చినప్పుడు ఒక సంవత్సరకాలం అతి స్వల్పమైనట్టిదని అంగికరించవలసివుంటుంది. గత పన్నెండు నెలలలో నవ్యాంధ్ర ప్రభుత్వం సాధించిన విజయాలను, నిర్వహించిన కార్యకలాపాలను రాష్ట్ర ప్రభుత్వ ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఈ క్రింది వ్యాసంలో సమగ్రంగా పొందుపరిచారు.

ఆంధ్రరాష్ట్రం శాంధ విచ్ఛిన్నకర మని కొందరనుకొన్నారు. కేవలం పరిపాలనా సౌకర్యం కోసమే అని మరి కొంతమంది సమర్థించారు. కాని ఆంధ్రజాతి పునరుత్థానానికి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం అత్యవసరమనేది ఇప్పుడందరూ గ్రహించారు. రాష్ట్రం ఏర్పడినప్పటినుంచి ప్రజా చైతన్యం, ప్రభుత్వకృషి సంధించుకొని ఉరకలు తీస్తున్నవి. ఇదివరలో పదేళ్ళలో కూడా జరుగవనుకున్న పనులు ఇప్పుడు రోజుల్లో, నెల్లో జరుగుతున్నవి. ఆంధ్రజాతి కలలన్నీ నిజమయ్యే పుణ్యకాలమిది. ఫిబ్రవరిలో కృష్ణా రెడ్డ్యాకేటర్ [illegible] ప్రారంభించాం. గ్రామాలకు జనశక్త్యాలను చేకూర్చే జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాన్ని అనేకచోట్ల ఏప్రిల్‌లో ఉగాదినాడు మొదలుపెట్టాం. దేశంలో అధిక సంఖ్యాకులు, అన్నదాతలు అయిన రైతాంగానికి ఐశ్వర్య సౌభాగ్యాలను చేకూర్చటానికై అటు నాగావళి, ఇటు స్వర్ణముఖి, మధ్యన అనేక చిన్న పెద్ద ప్రాజెక్టులను ప్రారంభించాం. ఇటీవలే జూలైలో ప్రత్యేక హైకోర్టును స్థాపించుకున్నాం. ఆనాటి దృశ్యం మరువరానిది. వానచినుకుల మధ్య వేలకొలదిగా ప్రజలు ఎంతో ప్రశాంతంగా, శ్రద్ధగా నిలబడి, ప్రభుత్వం ప్రజలు ఒకటే అని నిరూపించారు. అంతవానలో కూడా ఎంతో ప్రశాంతంతో ప్రవర్తించారు. వారి జయ జయ ధ్వానాలు, వారి నవ్వులముఖాలు, వారి చైతన్యం, ఇంకా నా స్మృతిపథంలో ఏమాత్రం మాసిపోకుండా వెలుగుతూనే ఉన్నవి. ఇటీవలనే తిరుపతిలో మరొక విశ్వవిద్యాలయాన్ని స్థాపించుకున్నాం.

రాష్ట్రం ఏర్పడీ ఏర్పడటంతోనే, అటు గోదావరి పొంగుకొచ్చింది. పొలాలు, ఇళ్ళు, వాకిళ్ళు, గొడ్లు గోద వినాశనానికి గురైనవి. వెంటనే ప్రభుత్వం తన యావత్ శక్తితో ప్రజలవాదుకున్నది. ఉచితంగా రూ. 19 లక్షలు ఇచ్చింది. వసూలు పద్ధతిపై రూ. 21 లక్షలిచ్చింది. చేనేతలకు రూ. 24,000 లు విరాళంగా ఇచ్చింది. బీద ప్రజలకు అన్నదానంకింద రూ. 2 25 లక్షలు ఖర్చు పెట్టింది. వడ్డీలేకుండా రైతులకు రూ. 10 లక్షలు ఇచ్చింది. కొత్తవాడల నిర్మాణానికై రూ. 3 లక్షలు ఖర్చు పెట్టింది. ఇలా సుమారు రూ. 66 లక్షలు ఖర్చుపెట్టి గోదావరి వరద బాధితులకు సహాయపడింది.

ఇటీవల విపరీత వర్షాలవలన దెబ్బతిన్న పశ్చిమగోదావరి జిల్లాలో ప్రభుత్వం రూ. 4 లక్షలకు పైగా ఖర్చు పెట్టింది.

అగ్ని ప్రమాదాల సందర్భంలో రూ. 8,20,000 లు ఖర్చు పెట్టింది.

గ్రామీణ నీటిసప్లయి స్కీములక్రింద రాష్ట్రం ఏర్పడాక 863 బావులు నిర్మింపబడినవి. రూ. 14 లక్షల ఖర్చు అయింది. ఈ ఏడాది బడ్జెట్‌లో రూ. 24 లక్షల మొత్తం ఇందుకై కేటాయించబడింది.

ఆంధ్రరాష్ట్రం రైతు రాష్ట్రం అంటే అతిశయోక్తి కాదు. 100 కి 90 మంది వ్యవసాయానికి చెందినవారే. కాబట్టి ప్రభుత్వం ఏంతలపెట్టినా, ఏంచేసినా ఎక్కువగా వీరి శ్రేయస్సును దృష్టిపథంలో వుంచుకొనే విధానంగా నే ఉండాలి.

తక్కావి ఋణాలక్రింద 1-10-53 నుంచి 31-8-54 వరకు ప్రభుత్వం రైతులకు రూ. 46 లక్షలను మంజూరు చేసింది. ఈ ఏడాది బడ్జెట్‌లో ఇందునిమిత్తమై రూ. 94 లక్షల మొత్తం కేటాయించ బడింది. పంపింగ్ ఇన్‌స్టలేషన్ల క్రింద రూ. 1,29,500 లు ఖర్చు పెట్టింది. ఈ ఏడాది ఇందునిమిత్తమై రూ. 75,000 ల మొత్తం కేటాయించబడింది.

ఇక నీటి పారుదల ప్రాజెక్టుల విషయమై విశేషంగా చెప్పవలసిన్లే దను కుంటాను. ఈ రంగంలో కేవలం మొత్తం మీద ఆంధ్రరాష్ట్రానిదే అగ్రతాంబూలం. ఏ ప్రాంతం చూసినా, ఏదో ఒక ప్రాజెక్టు కనపడుతూనే ఉంటుంది.

ఆహారోత్పత్తికి సాగునీరు లేని లోపభూయిష్ట ప్రాంతాల కందిమింపు అభివృద్ధికై ప్రభుత్వం 28 మిలియన్లకు, చిన్నతరహా నీటిపారుదల స్కీములను సాంక్షన్ చేసింది. వీటిలో 37 స్కీములను [illegible] ప్రారంభించింది. వీటికి రూ. 5 కోట్ల సహాయం కేంద్రప్రభుత్వం నుంచి లభిస్తుంది. స్కీముల వివరాలు దిగువన పేర్కొనబడినవి.

| స్కీము | జిల్లా | అందజా ఖర్చు. పనులకు మాత్రమే, రూ. లక్షలలో |
|---|---|---|
| 1. నాగావళి కుడిపక్క కాల్వ | శ్రీకాకుళం | 15.00 |
| 2. సీతానగరం ఆనకట్ట | ,, | 11.00 |
| 3. వేగావతి ఆనకట్ట | ,, | 12 82 |
| 4. నారాయణపురం | ,, | 81 18 |
| 5. గంభీరంగెడ్డ జలాశయం | విశాఖపట్నం | 8.19 |
| 6. బండకట్టు కాల్వ స్కీము పునర్నిర్మాణం | పశ్చిమ గోదావరి | 5.00 |
| 7. నక్కలగండి జలాశయం | నెల్లూరు | 11.90 |
| 8. పాలేరు జలాశయం | ,, | 7.80 |
| 9 ఉప్పుటేరు దిగువ ఆనకట్టు | ,, | 7.50 |
| 10. ములిమడుగు సమీపంలో కోనమడుగువద్ద ఆనకట్టు | చిత్తూరు | 5 00 |
| 11. కాళంగినది ప్రాజెక్టు | ,, | 9.00 |
| 12. సిద్ధులగండి ప్రాజెక్టు | ,, | 1 25 |
| 13. దిగువ సగిలేరు స్కీము | కడప | 87 37 |
| 14. పింఛానది జలాశయం | ,, | 24 00 |
| 15. కె. సి. కెనాల్ అభివృద్ధి | ,, | 3 57 |
| 16. ఇలోడు ప్రాజెక్టు చెన్నరాయ స్వామిగుడి జలాశయం | అనంతపురం | 14 15 |
| 17. విద్యారణ్యస్వామి చెఱువు పునర్నిర్మాణం | ,, | 2.08 |
| | | 206.74 |

వీటిలో ఉప్పుటేరు, పాలేరు, నక్కలగండి, సాగిలేరు ప్రాజెక్టుల కిమధ్యనే శంకుస్థాపనోత్సవాలు జరిగినవి. మిగతా ప్రాజెక్టులపని చురుగ్గా సాగుతోంది.

గొంచేరు మరియు స్కీమువల్ల 10,000 ఎకరాలు కొత్తగా సాగులోకి వస్తవి. ఇప్పుడు ఆయకట్టులో 120875 టన్నుల పంట అధికంగా పండుతుంది. స్కీము 100 కి 60 పాళ్లు పని పూర్తి అయింది. అందజా ఖర్చు రూ. 154 లక్షలు.

ఇవన్నీ ప్రథమ పంచవర్ష ప్రణాళిక గడువులో ముగింపబడునవి.

ఇంక పెద్ద ప్రాజెక్టుల విషయం కృష్ణా పెన్నార్ ప్రాజెక్టు క్రింద 11 లక్షల ఎకరాలకు అదనంగా మరో కలక్ష ఎకరాలు సాగవుతవి. అందజా ఖర్చు రూ. 2.84 కోట్లు. తుంగభద్ర ప్రాజెక్టు క్రింద ఒకటిన్నరలక్షల ఎకరాలకు పైగా సాగవుతవి. అందజా ఖర్చు రూ. 31.5 కోట్లు. కైరవాని తిప్ప ప్రాజెక్టు వలంగా 8,000 ల ఎకరాలు సాగవుతవి. అందజా ఖర్చు రూ 102 లక్షలు. ఎగువ పెన్నారు ప్రాజెక్టువలన 5,000 ల ఎకరాలకు నీటివసతి ఏర్పడుతుంది. అందజా ఖర్చు రూ. 84 లక్షలు. రాళ్లపాడు ప్రాజెక్టువలన 8,000 ల ఎకరాలు సాగవుతవి. అందజా ఖర్చు రూ. 58 లక్షలు.

రైతుల విషయంలో ప్రభుత్వం చేస్తున్న కృషిని వివరించేప్పుడు, ప్రభుత్వభూమి పంపిణీ విధానంగురించి చెప్పటం అవసరం. పొలాలు లేని పేదలకు ప్రభుత్వం మనిషికి రెండున్నర ఎకరాల [illegible] ఎకరాల భూమిని ఉచితంగా ఇస్తోంది. ఈ విధానం రెండు పేదభూముల పంపకంతో ప్రారంభమైంది. రూ. 3 కోట్ల విలువ కల భూములు ఉచితంగా పేదలకు ఇవ్వబడుతున్నవి. పంటనీరు లభించాక ఈ పొలం ఎకరానికి 20 బస్తాలు కూడా పండుతుంది. ఈ భూములకు వరదల బాధ కలకుండా ఉండేందుకుగాను ప్రభుత్వం రూ. ఒకటిన్నరకోట్లు ఖర్చు పెట్టింది. ఉచితంగా నిరుపేదలకు భూమిని ఉచితంగా పంచినరాష్ట్రం ఆంధ్రరాష్ట్రం ఒక్కటే అంటే అతిశయోక్తి కాదు.

నిరుపేదలలో సమాజంలో వెనక బడ్డ వర్గాలవారు ముఖ్యులు. వారి జనులకై, ఇతరులకై ప్రభుత్వం అనేక సౌకర్యాలను సమకూరుస్తోంది. పిల్లలు పాఠశాలల్లో జీతాలు చెల్లించనక్కరలేదు. 1953-54 లో హరిజనులకు స్కాలర్‌షిప్పుల క్రింద ప్రభుత్వం రూ. 2,41,451 లు, మతాంతరుల కింద రూ. 1,58,855 లు, మధ్యాహ్న భోజనాలకై రూ. 482000 లు, బోర్డింగు గ్రాంట్ల కింద రూ. 1330000 లు ఖర్చు పెట్టింది. ప్రభుత్వ హాస్టళ్లకు రు. 1,20,000 లు ఖర్చు అయింది. ప్రభుత్వ పాఠశాలల క్రింద రూ. 11,08,600 లు ఖర్చు అయింది. ఇళ్లస్థలాలను సమకూర్చుటకై రు.8,87,800 ప్రభుత్వం ఖర్చు పెట్టింది. ఈ ఏడాది ఇందుకై రూ. 10 లక్షల నిధి ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది.

గ్రామప్రాంతాలను పునరుద్ధరించటానికి కమ్యూనిటీ ప్రాజెక్టులను అనుబంధంగా జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాలు అమలు జరుపబడుతున్నవి.

రాష్ట్ర సర్వతోముఖ అభివృద్ధికి గాను తయారుచేయబడిన పంచవర్ష ప్రణాళిక క్రింద ఖర్చు అయ్యే రూ. 51 కోట్ల పైచిలుకు మొత్తంలో సగానికి పైగా రైతాంగపు అవసరాలకై ప్రభుత్వం [illegible]

#### విద్యుచ్ఛక్తి స్కీములు

ఇంక విద్యుచ్ఛక్తి స్కీములపై ప్రభుత్వం ఎంత ఖర్చు పెట్టుతోందో చూద్దాం:—

| | మొత్తం శక్తి కిలోవాట్లు | ఖర్చు. రూ. కోట్లు |
|---|---|---|
| 1. మచ్‌కండ్ | 1,02,000 | 15 07 |
| 2. తుంగభద్ర | 72 000 | 7.3 |

ప్రథమ పంచవర్ష ప్రణాళికక్రింద విద్యుచ్ఛక్తి స్కీములకై రూ. 24.68 కోట్లు కేటాయింపబడినవి. ఈ ప్రణాళికలో 5 స్కీములు చేర్చబడినవి. వాటి వివరాలు.—

| స్కీము | మొత్తం ఖర్చు రూ. లక్షలు. | అయిదేళ్ల ప్రణాళిక మొత్తం ఖర్చు రూ. లక్షలు. | ముగింపు తేదీ. |
|---|---|---|---|
| 1 మచ్‌కండ్ హైడ్రో థెర్మల్ స్కీము ప్రైవేట్ థెర్మల్ జెనరేషన్, రవాణా తీగలు, పంపిణీలతో. | 2814 | 1683 | 1955 మొదటి ఘట్టం |
| 2 తుంగభద్ర హైడ్రో థెర్మల్ స్కీము పైలట్ జనరేషన్, రవాణా తీగలు, పంపిణీలతో. | 457 | 830 | మార్చి 1955 |
| 3. నెల్లూరు థెర్మల్ స్కీము రవాణా తీగలు, పంపిణీలతో. | 183 | 92 | మొదటి ఘట్టం పూర్తి అయింది. |
| 4. చిత్తూరుజిల్లా పంపిణీ స్కీము. | 100 | 91 | |
| 5. తుంగభద్ర కామన్ వర్క్స తుంగభద్రబోర్డు ఆధ్వర్యం ఆంధ్ర వాటా 80 శాతము | 404 | 821 | 1957 మొదటి ఘట్టం |

ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద విద్యుచ్ఛక్తి స్కీములకై రూ. 32.46 కోట్ల మొత్తం తాత్కాలికంగా నిర్ణయింపబడింది. ప్రథమ ప్రణాళిక ఆఖరున సగటు వ్యక్తి విద్యుచ్ఛక్తి వినియోగం 10 యూనిట్లు ఉంటుంది. ద్వితీయ ప్రణాళిక ఆఖరున 20 యూనిట్లు ఉంటుంది. అంటే వినియోగం రెట్టింపవుతుంది.

ఈ రెండవ ప్రణాళిక క్రింద, మచ్‌కండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టు, తుంగభద్ర హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టు కొరకలో కార్యక్రమాలు పూర్తిచేయబడతవి. కింది కొత్త ప్రాజెక్టులుకూడా చేర్చబడినవి.

1. పందికొండ హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీము.
2. శైలేరు హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీము.
3. నెల్లూరు థర్మల్ స్కీము విస్తరణ.

1-10-53 నుంచి 1-10-54 వరకు 4,050 కనెక్షన్లు ఇవ్వబడినవి. 810 పంపుసెట్లకు, 45 బస్తీలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడింది.

#### రోడ్లు

ఈ ఏడాది సాథవలసవద్ద చంపావతిపై వంతెన పూర్తి అయి, రాకపోకలారంభింపబడినవి. దేశీయ రహదార్లలో ఇది మొదటి పెద్ద వంతెన. పెన్నానదిపై వంతెన త్వరలో ముగియవచ్చు. కృష్ణా బ్యారేజిపని సాగుతోంది. చించేరువద్ద తూర్పుగోదావరిజిల్లా, గోదావరిశాఖ గౌతమిపై వంతెన నిర్మాణం మంజూరైంది. దీనికి రూ. 124.79 లక్షల ఖర్చు అవుతుందని అందజా

(8 వ పేజీ చూడుడు)

# భాషా రాష్ట్రాలకు ఆంధ్ర రాష్ట్రం మార్గదర్శిని

**శ్రీ బి. పుల్లారెడ్డి (ప్రధాన కార్యదర్శి)**

అనేక సంవత్సరాలుగ స్వరాష్ట్రం కోసం ఆంధ్రులు సాగించిన ఆందోళన అందరకు తెలిసినదే. ఉద్రేకపూరిత వాతావరణమధ్య 1953 అక్టోబరు 1 న ఆంధ్రరాష్ట్రం అవతరించింది.

అట్లాసులో ఎక్కడ వున్నదా అని వెదుక్కవలసి వచ్చే కర్నూలు పట్టణం రాజధాని అయింది. అక్టోబరు 1 నాటికి కర్నూలు వచ్చిన వుద్యోగులకు చాలా యిబ్బందులు కలిగినవి. అటువంటి సమయంలో నిజంగా యుద్ధకాలంలో ప్రదర్శించవలసిన ఓర్పును, శారీరకంగాను, మానసికంగాను కూడ గివర్నరు, మంత్రులనుంచి గుమాస్తాలు, నౌకర్లవరకు చూపారు. ఇది చాలా అభినందించాల్సిన విషయం. రాష్ట్ర ఆర్థిక స్థితి నిరుత్సాహకరంగా వుండినది. అయినా రాష్ట్రం వచ్చిన కొద్ది నెలలకే కృష్ణా బ్యారేజి నిర్మాణానికి ప్రభుత్వం పూనుకొంది.

## ఉద్యోగులకు ఇళ్లు

ఉద్యోగులకు వసతి సౌకర్యం చాలా ముఖ్యమని గుర్తించి, ఇప్పటికి 400 ఇళ్లు నిర్మించి ఇవ్వడం జరిగింది. 1954 జనవరి ప్రారంభంలో ఖైదీల విడుదల జరిగింది. దానివలన అంతి నష్టమేమీ కల్పించలేదు.

ఆయుర్వేద, యునానీ వైద్యవిద్య గురించి తెలుగు డైపు రైటరు, షార్టు హాండ్ గూర్చి ఆంధ్రలో స్వాతంత్ర్య ఉద్యమంగూర్చి అనేక కమిటీలు ఏర్పాటు చేయబడినవి.

## హైకోర్టు ప్రారంభం

గుంటూరులో ఆంధ్ర హైకోర్టు నెలకొల్పడం ఆంధ్రప్రభుత్వం సాధించిన ఘనకార్యాలలో ఒకటి. ఆంధ్ర న్యాయవాదులకు యిది ఎంతో ప్రోత్సాహాన్ని కలుగజేసింది.

ఆంధ్రావని పురోభివృద్ధిలో మరో ముఖ్యాంశం తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వకళా పరిషత్తు స్థాపన. వెనుకబడిన రాయలసీమకు ఇది అందుబాటులో వుండి అభివృద్ధికి దారిచూపగలదు.

అనేక ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలు తీసుకున్నాము. సంఘానికి వెన్నెముక అనదగిన గ్రామీణుల సర్వతోముఖాభివృద్ధికి యీ విధంగా అనేక చర్యలు తీసుకోబడినవి.

ఆంధ్రరాష్ట్ర ఆర్థిక స్థితిని గమనించాక కేంద్రంపై ఆధారపడక తప్పదని పించింది. కాని జాతీయ ప్రణాళికా ఋణానికి అనుకున్న దానికంటె ఎక్కువ ... ఆంధ్రలో లభించింది. ఆంధ్రలో 515 లక్షలు వసూలయింది.

కొన్ని జిల్లాలలో 1949 నుండి శాంతి భద్రతలు కాపాడటం కష్టమవుతూ వచ్చింది. యాత్రిలు, సత్యాగ్రహాలు ఎక్కువయినాయి. అత్యాచారాలు జరుగుతున్నాయన్న ఫిర్యాదులు అట్టే లేకుండానే అతి నేర్పుతో శాంతి భద్రతలు కాపాడగలిగాం. అయితే పోలీసుశాఖకు పరీక్షాకాలం యింకా ముందుకూడ వున్నది.

సెక్రటేరియట్ సిబ్బంది ప్రదర్శించిన సహనం మెచ్చుకోతగ్గది. బాధాకరమైన వసతి ఏర్పాట్లతో ఎక్కువ గంటల పనితో అలాగా వుత్సాహంగా పనిచేశారు. ఆంధ్రరాష్ట్రం ఆశయమైన సంక్షేమరాజ్యస్థాపనకు వారు పరిస్థితులకు తగినట్లు నడుచుకొని ఎంతో సహకరించారు.

భాషారాష్ట్రాల మంచిచెడ్డల గూర్చి ప్రచారం చేయడం నాపని కాకపోయినా, ఆంధ్రప్రజలూ, ప్రభుత్వం కూడా తాము ఏడాదిలో సాధించు కొన్న విజయాలకు సంతృప్తి చెందడానికి తగిన కారణం వున్నది.

# రాష్ట్ర కార్మిక శాఖ కార్యక్రమాలు

**శ్రీ సి. ఆర్. రెడ్డి (లేబర్ కమీషనర్)**

ఆంధ్రరాష్ట్రం పారిశ్రామికంగా బాగా అభివృద్ధికాలేదు. రాష్ట్రంలో 2,750 ఫ్యాక్టరీలున్నాయి. వీటిలో చాలా బియ్యంమరలు, నూనె మిల్లులు, ప్రత్తి, వేరుశెనగ మిల్లులు పొగాకు పరిశ్రమలో కార్మికులు విరివిగా ఉంటారు. ఇటీవలనే పంచదార సిమెంటు, నార మిల్లులు అభివృద్ధి అయాయి.

గుంతకల్లులో ఒక సహకార వస్త్రాలమిల్లు రాష్ట్రీయ తరణావంతరం ప్రారంభించబడింది. పశ్చిమ గోదావరిజిల్లా తణుకులో మరో వస్త్రాల మిల్లు నిర్మాణానికి పూనుకోవటం జరిగింది. కృష్ణాజిల్లాలో మరో పంచదార మిల్లు నిర్మాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి. విశాఖపట్టణంలో కాల్టెక్సువారు ఒక నూనె శుద్ధి కర్మాగార నిర్మాణానికి పూనుకుంటున్నారు. తుంగభద్ర మాచ్‌ఖండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులు పూర్తికావటంతో, పరిశ్రమలు హెచ్చుగా పెరగటానికి అవకాశం లభిస్తుంది.

రాష్ట్రంలో లేబర్ కమీషనర్ ఫ్యాక్టరీల బాయిలర్ల చీఫ్ ఇనస్పెక్టరుగ వ్యవహరిస్తారు. అతనే ట్రేడ్ యూనియన్ల రిజిస్ట్రారుగా కూడా పనిచేస్తున్నారు. ఒక అసిస్టెంటు లేబర్ కమీషనర్ ఉన్నారు. ఒక డిప్యూటీ ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టరు ఉన్నాడు. మద్రాసుషాపుల, సిబ్బందీచట్టం, మదరాసు ప్రసూతి సహాయ చట్టం ఈ రాష్ట్రంలో పనిచేస్తున్నాయి. మిగతా కేంద్ర కార్మికచట్టాల అమలును ఈ శాఖ నిర్వహిస్తోంది.

1948 ఫ్యాక్టరీల చట్టం ప్రకారం యజమానులు కార్మికుల శ్రేయస్సుకు ప్రథమచికిత్స, కాంటీన్‌వంటి ఏర్పాటు చేయవలసివుంది. రాష్ట్రంలో 88 ఫ్యాక్టరీలు డిస్పెన్సరీలు, లేదా ఆసుపత్రులు ఏర్పాటు చేశాయి. 36 ఫ్యాక్టరీలు కాంటీన్లు, 40 ఫ్యాక్టరీలు విశ్రాంతిషెడ్డులు, 34 ఫ్యాక్టరీలు (క్రేచ్) ఏర్పాటు చేశాయి. 500, ఆ పైన కార్మికులు పనిచేస్తున్న ఫ్యాక్టరీలకు కార్మికుల సంక్షేమ అధికారిని నియమించాలి. రాష్ట్రంలో అట్టి ఫ్యాక్టరీలు దాదాపు 47 ఉన్నాయి. కొన్ని ఫ్యాక్టరీలలో కార్మికులసంక్షేమ అధికార్లు నియమింపబడ్డారు.

మద్రాసు ప్రసూతి సౌకర్యాల చట్టం (1934) ప్రకారం గర్భిణీ స్త్రీలు ప్రసవానికి కొంతకాలంముందు, ప్రసవించిన తర్వాత కొంతకాలం ఫ్యాక్టరీలలో పనిచేయకూడదని నిషేధించబడింది. ఆ కాలంలో వారికి కొంత కూలి చెల్లించబడుతుంది.

మద్రాసు షాపుల, సిబ్బందీలచట్టం (1947) అన్ని షాపులకు, హోటళ్లకు, సినిమాహాళ్లకు, వాణిజ్య సంస్థలకు వర్తిస్తుంది. ఈ చట్టం 38 మున్సిపాలిటీలలోనూ, 186 పంచాయితీలలోనూ, 8 ప్రత్యేక ప్రాంతాలలోనూ ప్రవేశపెట్టబడింది. 72,262 సంస్థలు ఈచట్టం క్రిందకు వచ్చాయి. సిబ్బందికి వారానికి ఒకరోజు విధిగా జీతంతో శెలవు ఇవ్వాలి. 12 రోజులు కాజువల్ శెలవు, 12 రోజులు ఎరండ్ శెలవు, 12 రోజులు అనారోగ్య శెలవు ఏడాదికి పనివారలకు ఇవ్వాలి. ఈచట్టాన్ని అమలుపర్చటానికి 57మంది అసిస్టెంటు లేబరు ఇనస్పెక్టర్లు నియమించబడ్డారు. జిల్లాలలో పనినిముగ్గురు రీజనల్ ఫ్యాక్టరీల ఇనస్పెక్టర్లు, అయిదుమంది ఫ్యాక్టరీల ఇనస్పెక్టర్లు అజమాయిషీ చేస్తారు. లేబర్ కమీషనర్, అసిస్టెంటు లేబరు కమీషనర్లు అప్పిలేట్ అధికారులుగా అప్పీళ్లను విచారిస్తారు.

1936 వేతనాల చెల్లింపుచట్టం కొన్ని తరగతుల వ్యక్తుల వేతనాలను క్రమబద్ధం చేసింది. ఈ చట్టంక్రింద కేసులను లేబర్ కమీషనర్, అసిస్టెంటు కమీషనర్లు పరిశీలిస్తారు.

కనీస వేతనాల చట్టంప్రకారం ఉన్ని తివాసీల, కాలువల పరిశ్రమలో, బియ్యం, పిండి, పప్పుమిల్లులలో, పొగాకు పరిశ్రమలో, రబ్బరు, కాఫీ ఎస్టేట్లలో, నూనె మిల్లులలో, స్థానిక అధికార సంస్థలలో, రోడ్ల భవనాల నిర్మాణంలో, రాళ్ళను పగలకొట్టే పరిశ్రమలో, మైకాపనులలో, ప్రభుత్వ మోటార్ ట్రాన్సుపోర్టులో, చర్మకార పనులలో పనిచేసేవారికి కనీస వేతనాలు నిర్ణయించ బడ్డాయి.

1928 పనివారు నష్టపరిహారచట్టం ప్రకారం ఫ్యాక్టరీలలో ప్రమాదాలకు గురైనవారికి పరిహారంఇచ్చే ఏర్పాటు చేయబడింది.

1948 పనివారల స్టేటు ఇన్సూరెన్సు చట్టంప్రకారం ఢిల్లీలో ఒక కార్పొరేషన్ ఏర్పాటు చేయబడింది. దేశమంతటా రీజనల్ ఆఫీసులు తెరవబడ్డాయి. ఈ చట్టాన్ని నెల్లిమర్ల, విశాఖపట్టణం, చిట్టివలస ప్రాంతాలలో అమలుపర్చటానికి ఆలోచిస్తున్నారు.

1926 ఇండియన్ ట్రేడ్ యూనియన్ల చట్టం, 1946 పారిశ్రామిక పనివారల నియోగపు (స్టాండింగ్ ఆర్డర్ల) చట్టం, 1947 పారిశ్రామిక తగాదాల పరిష్కారచట్టం అమలుకు కార్మిక శాఖ శ్రద్ధ వహిస్తుంది. 1954 మార్చి 31 వ తేదీకి 167 ట్రేడ్ యూనియన్లు రిజస్టర్ అయాయి.

## జాతీయ రుణానికి రసీదులు

మదరాసు, సెప్టెంబరు 29: 1964 సం॥ 3¾% జాతీయ ప్రణాళిక ఋణమునకుగాను మదరాసు పబ్లిక్ రుణాల ఆఫీసునందు దరఖాస్తులు అందజేసిన వారికి రసీదు పత్రాలు తయారై జారీ అయినవి. ఈ రసీదు పత్రాలను తీసుకోవాలనే వారు 1-వ లైను బీచిలోగల రిజర్వుబ్యాంకి కార్యాలయమున తీసుకోవచ్చును.

## టెండరు నోటీసు

### హైవేస్ డిపార్టుమెంటు

లోగడ 28-9-54-వ తేదీన పిలువబడిన టెండర్లు కాకినుండి కన్యాకుమారి వరకు పోవు రహదారి భాగములో అనంతపురము నుండి - మైసూరు సరిహద్దువరకు, మరియు మదరాసునుండి-బొంబాయికి పోవు రహదారికి పోవు భాగములో చిత్తూరు జిల్లా సరిహద్దునుండి అనంతపురము వరకూ తారు రోడ్డు వేయుటకు 28-10-54-వ తేదీ సాయంకాలము 4-0 గంటలవరకు పొడిగింపబడినది. కాంట్రాక్టు డాక్యుమెంట్లు 27-10-54-వ తేదివరకు అమ్మబడును.

తో. అ. రామనాథ రెడ్డి,
డివిజనల్ యింజనీరు, అనంతపురము.

## నోటీసు

### దక్షిణ రైల్వే

1954 అక్టోబరు 1-వ తేది నుండి రాజమండ్రి రైల్వే స్టేషను హెడ్డుగా గలిగి పని చేయుచున్న అమలాపురం, డెల్టా - గన్నవరం అవుట్ - ఏజెన్సీ లందున్ను, నర్సాపూరు రైల్వే స్టేషను హెడ్డుగా గలిగి పని చేయు చున్న రాజోలు అవుట్ - ఏజెన్సీయందున్ను తాత్కాలికముగా అన్ని విధము లైన రవాణాలు నిలుపబడినవి. ఈ అవుట్-ఏజెన్సీలు తిరిగా యెప్పటినుండి ప్రారంభమగునదియు తరువాత ప్రకటింపబడును.

చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటు,
27-9-54. మద్రాసు

# 'కొత్తగా ప్రభుత్వ పక్ష స్థాపన అనవసరం'

## శ్రీ సంజీవరెడ్డి అభిప్రాయం

మద్రాసు, సెప్టెంబరు 29: ఆంధ్ర రాష్ట్రంలో ప్రభుత్వ పక్షం అనేది కొత్తగా ఏర్పడవలసిన అవసరం కనుపడటం లేదనీ, ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడిన నాటినుంచీ ఆంధ్ర ప్రభుత్వ పక్షం ఏర్పడినట్లే లెక్క అనీ, తలో దారిగా ఉండే స్వతంత్ర పక్ష సభ్యులను కాంగ్రెసు క్రిందకు తేవడం సాధ్యమైన పనిగాదనీ, రాదలచుకున్న వారు కాంగ్రెసులోకి క్రమంగా వస్తూ ఉంటారనీ, ప్రకాశం, తిమ్మారెడ్డిగార్ల నిదర్శనమే. ఇందుకు చాలనీ ఆంధ్ర రాష్ట్ర ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవ రెడ్డిగారు ఇవాళ పత్రికా ప్రతినిధులతో చెప్పారు.

ప్ర:- ప్రభుత్వ పక్షం అనేది ఏర్పాటు గావాలని కాంగ్రెసు కార్యదర్శి చెప్పినదాన్ని గూర్చి ఏమి చెబుతారు?

స:- ప్రభుత్వంలో ఉండే వారంతా అవసరమైనప్పుడల్లా ఒక్కటిగా కలిసి ఓటు చేస్తున్నారు. ప్రభుత్వం ఏర్పడిన నాటినుంచీ ప్రభుత్వంలో ఉండేవారు కలసే పని చేస్తున్నారు. కొత్తగా వచ్చేవారు వస్తే మహాసంతోషం. ప్రకాశం గార్ని, తిమ్మారెడ్డిగార్ని, కూనిశెట్టివార్ని చూశారుగా! స్వతంత్ర సభ్యుల నెవరు కూడగట్టుకు రాగలరు? వారికి తోక తెగిన ఏమి? అది సాధ్యమా? సాధ్యమైనంతవరకు మేము శతమత మౌతూనే ఉన్నాము.

ప్ర: సంకీర్ణ మంత్రివర్గ నిర్మాణానికి ప్రధమలక్షణంగా ప్రభుత్వపక్షం ఏర్పాటు కావాలని అధిష్ఠానవర్గం అనుకున్నదనీ, అదీకూడా సాధ్యపడలేదనీ మెహతాగారు చెప్పారుగదా! ప్రభుత్వపక్షం ఏర్పడితే పరిస్థితి కొంత మెరుగు గాగలదంటారా? లేదా?

స: మెరుగ అవవచ్చు. కాంగ్రెసు మంచిబలమూ, ప్రభుత్వానికి మంచి అండా లభిస్తాయి. ప్రభుత్వం సమర్థంగా పనిచేయడానికి వీలు అవుతుంది. అది మంచి ప్రతిపాదనే!

ప్ర: మరిదాన్ని అమలుపరచడానికి ఏమిచేస్తున్నారు? ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గం, శాసనసభా కాంగ్రెసు కార్యవర్గం ఎప్పుడు సమావేశం కాగలవు?

స: ఎవరినీ బలవంతం పెట్టలేము. అది క్రమంగా జరగాల్సినపని. నేనూ, గోపాలరెడ్డిగారు తోటివాళ్లతో కలుస్తూనే ఉన్నాము. కలుస్తూనే ఉంటాము.

ప్ర: ప్రభుత్వంలో విశ్వాసం వెల్లడించే తీర్మానం నెగ్గడానికి ఈ ప్రభుత్వపక్ష నిర్మాణం దోహదం చేయదా?

స: ప్రభుత్వంపై అవిశ్వాసతీర్మానం ఓడిపోవడమే ప్రభుత్వంపై విశ్వాసం వెల్లడవడమన్నమాట. అది శాసనసభ సమావేశమైనప్పుడు తేలుతుంది. సాధ్యమైనకృషి చేస్తున్నాము. ప్రకాశంగారు కాంగ్రెసులోకి ఎట్లావచ్చారు? తిమ్మారెడ్డిగారు ఎల్లా వచ్చారు? 47 మంది ఉన్న కాంగ్రెసు బలం ఇంతవరకు ఎల్లా పెరిగిందీ, తొందరపడితే పనులు కావు. కాలం కలిసివచ్చి, వారి వారికి బుద్ధి పుట్టినప్పుడు కాంగ్రెసులో చేరుతూ ఉంటారు అంతే.

### ఆంధ్రప్రభుత్వం విజయాలు

ప్ర: ఆంధ్ర ప్రభుత్వం ఈ ఏడాదిలో సాధించిన ఘనవిజయాలు ఏమి?

స: ఈవేడాది మేము వెనుదిరిగి చూస్తే సాధించిన ఘనవిజయాలు చాలావున్నాయి. మేము గర్వించదగినది చాలావున్నది.

### ప్రజాస్వామ్యం

ప్ర: సత్యాగ్రహాన్ని విరమించి ప్రజాస్వామ్య పద్ధతులు అవలంబించాలని ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షులు చేసిన విజ్ఞప్తికి సమాధానంగా శాసనసభ కృషికార్ లోక్ పక్ష అధ్యక్షులు లచ్చన్నగారు ముందు మద్యనిషేధ విషయంలో ప్రభుత్వం దాన్ని అనుసరించేట్టు చేయమని చెప్పినదాన్ని మీరు గమనించారా?

స:- సత్యాగ్రహం ప్రజాస్వామ్య పద్ధతిగాదు. ప్రజాస్వామ్య పద్ధతుల ప్రభుత్వం గౌరవించడానికి సిద్ధంగానే ఉన్నది. గాంధీగారు ప్రారంభించిన సత్యాగ్రహానికీ లచ్చన్నగారి సత్యాగ్రహానికి హస్తిమశకాంతరం ఉన్నది.

ప్ర:- శాసనసభవారు మద్య నిషేధ విషయమై ఒక తీర్మానం చేసినప్పుడు ప్రభుత్వం మద్య నిషేధాన్ని ఒక ప్రధాన విధానంగా భావించడం లేదా?

స:- మద్యనిషేధంకోసం ఏమైనా చేయడానికి ప్రభుత్వం మద్య నిషేధాన్ని ప్రధాన విధానంగానే ఎంచుతోంది.

### వరిహద్దులు

ప్ర:- వరిహద్దులను గూర్చి మదరాసు ప్రభుత్వంలో కొద్దికాలంలో పరిష్కారం చేసుకుంటారా?

స:- క్రమంగా చేసుకుంటాము.

మద్రాసు, సెప్టెంబరు 29: ఆంధ్ర రాష్ట్ర ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవ రెడ్డిగారు ఇవాళ ఉదయం మదరాసు ముఖ్యమంత్రి కె. కామరాజ నాడారుగార్ని ...









## దక్షిణ రైల్వే నోటీసు

1954 అక్టోబరు 1 శుక్రవారమునుండి, నెం. 16 & 15 గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ రైళ్లలో:

(i) ఢిల్లీ - హైదరాబాదుల మధ్య వారానికి మూడుసార్లు నడుచుచుండిన కోచికి మారుగా ప్రతిరోజు సరాసరి III-వ తరగతి పెట్టె పై స్టేషన్ల మధ్య వేయబడును.

(ii) మద్రాసు-హైదరాబాదు మధ్య వారానికి మూడుసార్లు నడుచుచుండిన III-వ తరగతి కోచికి మారుగా మద్రాసునుండి మంగళ, గురు, ఆదివారాల్లోను, ఢిల్లీనుండి సోమ, బుధ, శుక్రవారాల్లోను వారానికి మూడు పర్యాయములు మద్రాసు-ఢిల్లీల మధ్య సరాసరి III-వ తరగతి క్యారేజి వేయబడును.

చీఫ్ ఆపరేటింగ్ సూపరింటెండెంటు,
29-9-54. మద్రాసు-3.





# పంచవర్షప్రణాళిక పరిశ్రమలలో సమృద్ధిగా ఉత్పత్తి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 29: పంచవర్షప్రణాళిక మొదటి మూడేండ్లలో భారతదేశ ఆర్థిక వ్యవస్థకు కలిగిన బలము, స్థిరత్వము సంతృప్తికరముగా వున్నదనీ, శుభమును సూచిస్తున్నదనీ ప్లానింగ్ కమిషన్‌వారు 1953-54 నివేదికను ఈరోజు పార్లమెంటు ఉభయ సభలకు సమర్పిస్తూ చెప్పుతున్నారు.

ప్లానింగ్, ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి శాఖమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా సమర్పించిన ఈ నివేదిక 332 పుటల గ్రంథము. ఈ గ్రంథము ముఖ్యంగా 1953-54 లో జరిగిన అభివృద్ధికి ప్రాధాన్యం యిస్తున్నా మొదటి మూడేళ్లలోనూ జరిగిన కృషిని వివరిస్తున్నది. 1955-56 లక్ష్యాల సమీక్ష కూడా గ్రంథంలో వున్నది.

నివేదిక ననుసరించి వివిధ రంగాలలో అభివృద్ధి ఈ క్రింది విధంగా వున్నది.

వ్యవసాయం: 1949-50 లో పండిన ఆహారధాన్యాలకంటె 114 లక్షల టన్నులు ఎక్కువగా 1953-54 లో పండినవి. 5 సంవత్సరాలలో అదనంగా 76 లక్షల టన్నులు పండించాలనే లక్ష్యంకంటె పథకముయొక్క మూడవ సంవత్సరంలో 38 లక్ష్యాలు అధికంగా పండినవి.

ప్రత్తి ఉత్పత్తి: 96 లక్షల బేళ్లు పెరిగింది. 1950-51 లో 28.7 లక్షల బేళ్లు ఉత్పత్తి అయివుండగా 1953-54 లో 38.8 లక్షల బేళ్లు పండింది.

మైనర్ ఇరిగేషను పనులు: 5 ఏండ్లలో 112 లక్షల ఎకరాలకు నీటిసౌకర్యాలు కల్పించాలని లక్షించివుండగా ఇంతవరకూ నీటివసరులు యేర్పడ్డ, ఏర్పడనున్న ఎకరాలు 53 లక్షలు.

పథకం కాలంలో 14 లక్షల ఎకరాల బంజరుభూమిని సాగులోనికి తీసుకువి రావాలని లక్షించివుండగా 1951-54 లో 8.16 లక్షల ఎకరాలు సాగులోనికి వచ్చాయి.

పథకంలోని పెద్ద ఇరిగేషను ప్రాజెక్టులు పూర్తికావడంవల్ల 1954 మార్చి 31 తో అంతమయ్యే మూడేళ్లలో 28 లక్షల ఎకరాలు ఇరిగేషను క్రిందికి వచ్చాయి. ఈ కాలంలోనే అదనంగా 4,50,000 కిలోవాట్లు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అయింది. 1955-56 లోపుగా 12 లక్షల కిలోవాట్లు ఉత్పత్తి చేయాలని లక్షించారు.

బట్టలు: 1952-53 లో 147.6 కోట్ల పౌనుల పత్తినూలు ఉత్పత్తి అయివుండగా 1953-54 లో 152 కోట్లపౌనులు ఉత్పత్తి అయింది.

మిల్లుబట్టల ఉత్పత్తి 1953-54 లో 490 కోట్ల గజాలకంటె యిది 20 కోట్లు హెచ్చు.

గత సంవత్సరం చేమగ్గాలమీద 100 కోట్ల గజాలు ఉత్పత్తి అయివుండగా 1953-54 లో 120 కోట్ల గజాలు ఉత్పత్తి అయినవి.

ఉక్కు, ఇనుము: 1950-51 లో 9,67,000 టన్నుల ఉక్కు ఉత్పత్తి అయివుండగా 1953-54లో 10,81,000 టన్నులు ఉత్పత్తి అయింది.

# వ్యాపారసరళిలో కేంద్ర చలనచిత్ర శాఖ ఏర్పాటు

## లోక్ సభ అంచనాల కమిటీ సలహాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 28: భారత ప్రభుత్వ ఫిల్ముశాఖను వాణిజ్య సరళిలో పునర్నిర్మించి, సాధ్యమైనంత వరకు దాన్ని స్వయంపోషకం చేయాలని లోక్ సభ అంచనాలకమిటీ సలహా యిచ్చింది.

ఇద్దరు సుప్రసిద్ధ ప్రాడ్యూసర్ల లిఖిత సాక్ష్యందృష్ట్యా చూస్తే వర్తకులు డాక్యుమెంటరీ ఫిల్ములను తయారు చేయడం సాధ్యంకాదని ఫిల్ముశాఖ చేసిన ప్రకటన నమ్మిక కలిగించేదిగా లేదని కమిటీవారు చెప్పుతూ డాక్యుమెంటరీ ఫిల్ముల నిర్మాణాన్ని వర్తకులు చేపట్టడానికి ప్రోత్సాహం యివ్వాలని కోరుతున్నారు.

డాక్యుమెంటరీల నిర్మాణమును వర్తకులు చేపట్టితే ప్రభుత్వఖర్చు తగ్గుతుంది. ఫిల్ము డివిజను తయారుచేసే ఫిల్ముఖర్చు అడుగుకు 22 రూపాయలయి వుంది. వర్తకులకు అడుగుకు 10 నుండి 18 రూపాయలు మాత్రమే ఇచ్చారు. వర్తకులను ప్రోత్సహించడానికి అంతకంటే మంచిరేట్లు యివ్వాలి' అని కమిటీవారు చెప్పుతున్నారు.

ఈ కమిటీ నివేదికను అధ్యక్షుడు శ్రీ. అనంతశయనంగారి పక్షమున శ్రీ ఎచ్. వి. పటాస్కర్ ఈవేళ లోక్ సభకు నివేదించారు.

ఏకీకృతమైన దృష్టివుండాలి, వివిధ శాఖలకు ప్రత్యేకంగా ప్రచారశాఖాధికారులను నియమించే ధోరణిని నిరుత్సాహపరచాలి, ఇట్టి ఏకీకృతమైన దృక్పథంవుంటే సమాచార శాఖలో చాలావుంది ఈ దోషములను తగ్గించవచ్చు. అని కమిటీ సలహాయిచ్చింది.

'డాక్యుమెంటరీలు ప్రశస్తమైనవిగా, ఈ దేశంలో మాత్రమేగాక విదేశాల్లోకూడా మన్ననలు పొందేవిగా వుండాలి. భారతదేశ విజ్ఞానమును, అభివృద్ధినీ ప్రతిబింబించే డాక్యుమెంటరీలకు విషయములను నిర్ణయించేటందుకు ఒక సలహాసంఘం వుండాలి. అది సంవత్సరానికి ఒకసారి సమావేశమవుతూవుండాలి. ఈ డాక్యుమెంటరీలలో చిత్రకళకు ప్రాముఖ్యంయివ్వాలి.

వార్తాచిత్ర ఫిల్ములలో (న్యూస్ రీల్సు) ప్రజారంజకమైన విషయాలు వుండాలి. సంస్కృతికి, సారస్వతానికి, చిత్రకళకు స్థానంవుండాలి. జాతీయైక్యమును, సఖ్యమును, సమానభావమును పెంపొందించే విషయాలు వుండాలి.

ఈ న్యూస్ రీల్సులో సాంఘిక, వైజ్ఞానిక, సారస్వతసభలు, సమావేశాలుమున్నగువాటినిగూర్చి వుండాలి. గొప్ప మతకర్తల, వీరుల జన్మదినోత్సవాలు జరపాలి. గ్రామస్థులను వెనుకబడినవారిని, హరిజనులను పైకి తెచ్చే రీల్సువుండాలి. ముఖ్యకేంద్రాలలో సలహాసంఘాల వుండాలి" అని కమిటీ సలహాయిస్తున్నది.

హిందీలోనూ, ఉర్దూలోను ప్రచురించబడుతున్న 'ఆజకల్'ను ఆపివేయాలనీ లేదా దాన్ని స్వయంపోషకం చేయాల్సిందని కమిటీ సలహాయిస్తున్నది.

ప్రచురణశాఖ ప్రచురిస్తున్న కరపత్రాలు యిప్పటికంటె బాగావుండడానికి యెంతైనా అవకాశంవున్నదనీ, వాటిలోను ప్రసిద్ధ రచయితల చేత వ్యాసాలు వ్రాయించాలనీ, ప్రతిభారతీయులను ఆకర్షించడానికి బహుమానాలపద్ధతి ప్రవేశపెట్టవచ్చునని ఉపసంఘం సలహాయిస్తున్నది.

పిల్లలకుతగిన ఫిల్ములు తయారుచేయడంగూడా అవసరమని కమిటీవారు చెప్పుతున్నారు.

ఫిల్ముశాఖ లెక్కలను సరిగా వుంచాలని హెచ్చరిస్తున్నారు.

సమాచార, ప్రచారశాఖలోని మూడు అంతశ్శాఖలను ఏకంచేసే వాటిపైన ఒకే అధికారిని నియమించాలని కమిటీవారు కోరుతున్నారు. లేదా ఈ మూడు వేరు వేరుగానేవుండి మూడింటికీ సామాన్యమైన ఫోటో సెక్షన్లూ, పుస్తక భాండాగారాలు మున్నగువానిని ఏకంచేసి అన్నిశాఖలకు ఉపకరించేటట్లు చేయాలని కోరుచున్నారు.

కేంద్ర అధికారులు, రాష్ట్రాలలో సమాచార శాఖాధికారులూ అప్పుడప్పుడూ సమావేశం కావాలి. కేంద్రాధికారాలను, రాష్ట్రాధికారాలను స్పష్టంగా నిర్వచించాలి. గ్రామాలకు సమాచారాలు తెలిపే విషయమున కేంద్రం రాష్ట్రాలకు మార్గం దర్శకంగావాలి.' అని కమిటీ సలహాయిస్తున్నారు.

# గుంటూరు పట్టణ కాంగ్రెసు రద్దు

## సంఘ సమావేశంలో నిర్ణయం

గుంటూరు, సెప్టెంబరు 30: ప్రస్తుత సంఘం రద్దుఅయినట్లు భావిస్తూ, కొత్తసంఘాన్ని ఏర్పరచాలని ప్రదేశ కాంగ్రెసు సంఘ అధ్యక్షుని కోరుతూ నిన్నరాత్రి పట్టణ కాంగ్రెసు సంఘం వెంకటరెడ్డిగారి అధ్యక్షతన సమావేశమై తీర్మానించింది.

గుంటూరులో ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవం జరిగిన పిమ్మటైనా ప్రజాశ్రేయస్సు దృష్టితో ప్రస్తుత సంఘం సక్రమంగా పనిచేయటం లేదనీ, అందువల్ల ప్రస్తుత సంఘాన్ని రద్దుచేయటానికి నిశ్చయించారు. ప్రస్తుత సంఘం ప్రజాభిమానాన్ని చూరగొన్నది కాదని కూడా సభ్యులు అభిప్రాయపడ్డారు. (స్వ. వి.)

# కర్నూలులో ఆంధ్ర బాల మహాసభలు

మద్రాసు, సెప్టంబరు 30: ఆంధ్ర బాలానంద సంఘం కార్యదర్శి శ్రీ న్యాయపతి రాఘవరావుగారు యిట్లు వ్రాయుచున్నారు:

కర్నూలులో అక్టోబరు 2, 3, 4 తేదీలలో జరుగబోవు ఆంధ్ర బాల మహాసభలకు ఏర్పాట్లన్నియు పూర్తి అయినవి. సుమారు 400 ప్రతినిధులు ఆంధ్రదేశములోని పలుతావులనుండి వచ్చుచున్నారు. మదరాసునుండి సుమారు 100 గురు పిల్లలు ప్రతినిధులుగా వెళ్లుచున్నారు. ప్రతినిధులకు వసతి భోజనఏర్పాట్లు కర్నూలులో మునిసిపల్ హైస్కూలు హాస్టలులోను, కోల్సు హైస్కూలు హాస్టలులోను మంత్రి సంజీవయ్యగారిచే యేర్పాటు చేయబడిన స్థానిక ఆహ్వాన సంఘము వారిచే చేయబడినవి.

బాల వాఙ్మయ, చిత్ర, వస్తుప్రదర్శనము ఉస్మానియా కాలేజీ గదులలో ఏర్పాటు చేయబడినది. ఈ ప్రదర్శనను ఆంధ్ర విద్యామంత్రి శ్రీ పట్టాభిరామారావుగారు తెరచెదరు. శ్రీమతి కుసుమ త్రివేదిగారు అధ్యక్షత వహించెదరు. బాల మహాసభలను 3 తేదీని గవర్నరు శ్రీ సి. ఎం. త్రివేదిగారు ప్రారంభిస్తారు. ఈ సభలకు శ్రీ నీలం సంజీవ రెడ్డిగారు అధ్యక్షత వహించెదరు.

సభలు జరుగు ప్రతిదినము సాయంత్రం పిల్లల విజ్ఞాన వినోద ప్రదర్శనములు ప్రతినిధులచే ఇవ్వబడును.

ఈ సభలకు, విజ్ఞాన ప్రదర్శనములకు బాల సంక్షేమమును గోరు ఆంధ్రులందరూ ఇదే ఆహ్వానముగా తలచి రా ప్రార్థితులు.

# రాష్ట్రప్రభుత్వాల భారీ పరిశ్రమల ప్రాజెక్టులు

## తప్పనిసరిఅయితేతప్ప రెండవ ప్రణాళికలో చేర్చేదిలేదని ప్లానింగ్‌కమిషన్ సూచన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 29: ఇటుపై రాష్ట్రప్రభుత్వాలు తలపెట్టే భారీ పరిశ్రమల ప్రాజెక్టులు అత్యంత సమర్థనీయములు అయితేతప్ప, సుళువుగా ద్వితీయపంచవర్ష ప్రణాళికలో చేర్చబడవని ప్లానింగు కమిషన్‌వారు ఇటీవల రాష్ట్రప్రభుత్వాలకు తెలియచేశారని కేంద్రప్లానింగు ఉపమంత్రి శ్రీ. శుభ్‌లాల్ హాథీ ఇవాళ లోక్ సభలో శ్రీ బన్సాల్ ప్రశ్నకు సమాధానంగా తెలియ చేశారు.

ప్రభుత్వ యాజమాన్యాన నెలకొల్పే భారీ పరిశ్రమల వ్యవహారాలన్నీ ఇటుపై కేంద్రప్రభుత్వమే పూర్తిగా గుత్తకు పుచ్చుకుంటుందని ప్లానింగు కమిషన్‌వారు రాష్ట్రాలకు తెలియచేశారా? అనీ, అభివృద్ధి కార్యక్రమాలన్నిటినీ సమన్వయించడంకోసం భారీపరిశ్రమల వ్యవహారం తమ చేతులోనే ఉండాలని కేంద్రప్రభుత్వం కూడా భావిస్తున్నదా అనీ శ్రీ బన్సాల్ ప్రశ్నించారు.

రోడ్లువెయ్యడం, చిన్న పరిశ్రమలూ కుటీరపరిశ్రమలూ మొదలైన అభివృద్ధి కార్యక్రమాల విషయంలో మిగతావాటికన్న ఎక్కువగా రాష్ట్రప్రభుత్వాలు కృషిచేయడం వాంఛనీయమని ప్లానింగుకమిషనువారు భావిస్తున్నారని ఉపమంత్రి ఈ సందర్భంలో వివరించారు.

ప్లానింగుమంత్రి గుల్జారీలాల్ నందాగారు అనుబంధ ప్రశ్నలకు జవాబు ఇస్తూ రాష్ట్రాలలో పరిశ్రమల అభివృద్ధి కేవలం రాష్ట్రాల ప్రోత్సాహంమీదనే ఆధారపడి ఉండలేదని అన్నారు.

1951-54 సంవత్సరాలలో పంచవర్షప్రణాళిక ...

రూ॥లు అయితే, రాష్ట్రాలు విడిగా ఇచ్చిన సొమ్ము 211 కోట్ల రూపాయలే నన్న విషయం ఆయారాష్ట్రాల ఆదాయవ్యయలెక్కలు పరిశీలిస్తే విదితమవుతున్నదని ఆయన అన్నారు.

1954-55 లో రాష్ట్రాలవాటా సుమారు 70 కోట్ల రూ॥లని అంచనా వెయ్యబడిందనీ, ఈ ప్రమాణం విడిపోకుండా ఉండి, 1956-57 లో కూడా ఇంత సొమ్ము సమకూరితే, అప్పటికి, మొత్తం ప్రణాళిక బడ్జెట్లకే రాష్ట్రాలు 350 కోట్లరూ॥లు భరించినట్లవుతుందని నందా చెప్పారు.

రాష్ట్రాలు తమవంతు సొమ్మును పూర్తిగా సమకూర్చ లేకపోయినందువల్ల, ఇకనైనా, ఇతరమార్గాల ద్వారా దాన్ని భర్తీచేయవలసిన ఆవశ్యకతను ప్లానింగుకమిషన్‌వారు రాష్ట్రాలదృష్టికి తెచ్చారని ఆయన అన్నారు.

# చీఫ్ ఇంజనీర్ ఫ్రెడరిక్

## ఆంధ్రప్రభుత్వంక్రింద ఉద్యోగం మానివేస్తారట

కర్నూలు, సెప్టెంబరు 30: భవనాలూ, రహదార్లూ, ప్రజారోగ్యాల చీఫ్ ఇంజనీయరు కె. యం. ఫ్రెడరిక్ ఆంధ్ర ప్రభుత్వ ఉద్యోగం మానివేస్తారని తెలుస్తున్నది. ఆయన తిరిగి మద్రాసు ప్రభుత్వానికి వెళ్లిపోతారు. (స్వ. వి.)

# రైలులో స్మృతి తప్పిన ప్రయాణీకుడు

మద్రాసు, సెప్టెంబరు 30: చెన్నూరు దగ్గిర చిన్నమచ్చపల్లిలో ఆదిఆంధ్ర సహాయ ప్రాథమిక పాఠశాలలో హెడ్మాస్టరుగా ఉండిన వి. సంబంధమూర్తి (45) అను వతను నిన్న బొంబై ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు వచ్చేవరకి స్మృతిలేక పడి ఉండెను. అతన్ని జనరల్ ఆసుపత్రిలో చేర్చారు. సెవింగ్స్ బ్యాంకు పుస్తకంలో 29 వ తేదీన అతను రూ. 6/-జమ్మ తీసుకున్నట్లు ...

# మరణించిన వారి సంఖ్య 137 కు పెరుగుదల

(7 వ పేజీ తరువాయి)

మ్మదు హుసేన్ (దొర్నకల్లు) ఎస్. రాజా ఖాజీపేట, ఎర్రపాటి వెంకటేశం (సికింద్రాబాదు) గొట్టు తాతారావు (సికింద్రాబాదు) కృష్ణఅయ్యర్ (హనుమకొండ పోస్టల్ ఉద్యోగి)కుమరయ్య నరసింహం (రాచిపల్లి) ఎన్నపంట రామయ్య కృష్ణయ్య సికింద్రాబాదు) గుండా కృష్ణయ్య (సికింద్రాబాదు) కె. నారాయణరెడ్డి (సికింద్రాబాదు) రామయ్య బాలరాజ్ (సికింద్రాబాదు) రామచంద్ర కృష్ణ (బొంబాయి).

సికింద్రాబాదులోని పారడైజ్ సినిమా యజమాని శ్రీ టి. అంజయ్య కూడా యీ ప్రమాదంలో మరణించారు.

### మరణించినవారి మరికొన్ని పేర్లు

ఇప్పుడు రైల్వేవారు జారీచేసిన కొత్తజాబితాలో ఈ క్రింది పేర్లవారుగూడా విహతులైనట్లు వుంది. 1 మీర్జా అహ్మద్ ఆలీబేగ్, మహబూబ్ మీర్జా కుమారుడు 2. ఖ్వాజుద్దీన్, సోలార్ మసూద్ కుమారుడు, కాచీగుడా 3. మహమ్మద్ ఇసా, దావూద్ కుమారుడు, బేగం, 4. జమాలుద్దీన్ దాలి సాలార్ మసూద్, కాచీగుడా 5. వి. ఆర్ పినాకపాణి. రాజబహదూర్ కుమారుడు 6. విశోభాయ్, పినాక్ పాణి భార్య 7. మిశ్రిలాల్, అంబాలాల్ కుమారుడు.

### రైల్వేల ఇన్‌స్పెక్టర్ విచారణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: ఖాజీపేట ఎక్స్‌ప్రెస్ ప్రమాదంపై రైల్వేల ప్రభుత్వ ఇన్‌స్పెక్టరు రేపు హైదరాబాదులో చట్టరీత్యా విచారణ జరుపుతారని రైల్వే ఉపమంత్రి ఓ. వి. అలగేశన్‌గారు ఇవాళ లోక్ సభలో ప్రకటించారు. తనకు అందిన అధికార వార్తల ప్రకారం ఈ ప్రమాదంలో మరణించినవారి సంఖ్య 123 అనీ, గాయపడినవారి సంఖ్య 85 అనీ ఆయన చెప్పారు. గాయపడినవారిలో 17 మంది స్థితి తీవ్రంగాఉన్నదనీ, 34 గురు గొడ్డిగాయపడ్డారనీ, మరి 34 గురు అతిస్వల్పంగా గాయపడ్డారనీ వారంతా ప్రభుత్వ ఆస్పత్రులలో చేర్చబడ్డారని ఆయన చెప్పారు.

# శవాలకోసం నదిగాలింపు

## 150 మంది వృత్తి

వరంగల్లు, సెప్టెంబరు 30: ఆలేరు వద్ద జరిగిన విషాదసంఘటనకు 400 మందికి తక్కువకాకుండా చిక్కుకొనిపోయివుంటారని అభిజ్ఞవర్గాలవారు అంచనావేస్తున్నారు. ప్రమాదస్థలంనుంచి ఆ వాసంతీనది మూసీనదిలో సంగమమయ్యేవరకూ ఆ నలభైమైళ్ళ మేరా ఆ దేపనిగా గాలిస్తున్నారు. జిల్లాకలెక్టరు, డి. యస్. పి. ల పర్యవేక్షణక్రింద పోలీసులూ, రెవిన్యూ ఉద్యోగులూ, విద్యార్థులూ, వాలంటీర్లూ జట్లుజట్లుగా తయారై ఈ గాలింపుకార్యక్రమం కొనసాగిస్తున్నారు. ముక్కలు చెక్కలైపోయిన రైలు పెట్టెలతోటూకు శిథిలాలు 12 మైళ్లకు అవతలకూడ కనిపించాయి. దొరికిన శవాలసంఖ్య ఇంతవరకూ 150 ప్రమాదస్థలంనుంచి 19 మైళ్లి అవతలవరకూ గల మధ్యపరిధి అంతటా ఇరివిస్తరించి వుండినాయి. కొన్ని శవాలు నెల్లుట్ల మొదలైన దూరప్రదేశాలలోకూడ కనిపించాయి. బండ్ల సదుపాయంలేక ఈ శవాలను రోడ్డువైపునకు చేరవేయడం కష్టమవుతున్నది. వాలంటీర్లు పూనుకొని శవాలను రోడ్డుపక్కకు చేరవేస్తున్నారు. ఏటిలో మునిగిపోయిన పెట్టెలను ఇంకా పైకితీయలేదు.

### పురపాలకసంఘం సానుతాపం

పురపాలక సంఘంవారు ఈ విషాద సంఘటనకు విచారంతెలుపుతూ, నష్టపడ్డకుటుంబాలకు సానుభూతి తెలుపుతూ ఒక సంతాపతీర్మానంచేశారు. హాత, తుమలపట్ల గౌరవ సూచకంగా సభ్యులందరూ ఒక నిమిషంపాటు మౌనంగా నిలుచుకొన్నారు. (స్వ. వి)

# కార్యశాఖలకు ప్రత్యేక ఉద్యోగులు

## లోక్ సభలో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, సెప్టెంబరు 30: ఖజానాశాఖ ఉద్యోగులను బ్రిటన్‌లోవలె కార్యనిర్వాహక శాఖలలో నియమించే విధానం ఆచరణసాధ్యమూ కాదాఅన్న విషయాన్ని కేంద్ర మంత్రివర్గం పరిశీలిస్తున్నట్లు లోక్ సభలో నేడు ప్రధాని నెహ్రూ ప్రకటించారు. అంచనాల సంఘంవారి 9 వ నివేదికపై ప్రభుత్వ అభిప్రాయాలను తెలియజేస్తూ నెహ్రూ యీ విషయం ప్రకటించారు. ప్రతి మంత్రిత్వ శాఖలోను ఆర్థిక సలహాదారులను నియమించడం గూర్చి ప్రస్తుత బడ్జెటు, ఆర్థిక వ్యవహారాలలో సూచించబడిన మార్పులనుగూర్చి పరిశీలిస్తున్నట్లు యీ ప్రకటనలో పేర్కొన్నారు.

అనిశ్చయమైన ఖర్చులకుసంబంధించి కమిటీవారు గావించిన సిఫార్సుపై ప్రభుత్వశాఖల ఖర్చులో పొదుపుగా వుండడానికి ఆర్థికశాఖదే అంతిమ నిర్ణయమని ప్రభుత్వం అభిప్రాయపడినట్లు ఈ ప్రకటనలో వివరించారు.

ఇటీవల వివిధ మంత్రిత్వ శాఖలకు ఎక్కువ అధికారాలివ్వబడినవి. పరిస్థితి ఎప్పటికప్పుడు సమీక్షించబడుతున్నది.

పంచవర్ష ప్రణాళిక క్రింద: ఆ యేటి ఖర్చుకు ప్రత్యేకడిమాండు గూర్చి సమన్వయ పునఃపరిశీలన జరపాలని కమిటీ సిఫార్సుచేసింది. కాని ఇది వాంఛనీయమూ, అవసరమూకూడ కాదని శ్రీ నెహ్రూ చేసిన ప్రకటనలో పేర్కొనబడింది.

పార్లమెంటుకు అప్పుడప్పుడు ప్రణాళిక కార్యకలాపాలగూర్చి తెలియజేస్తామని - యీ ప్రకటనలో వివరించారు.

విశ్వవిద్యాలయాలకు విద్యాసంస్థలకు కావలసిన గ్రాంట్ల గూర్చి ఆర్థిక సంవత్సరం ముందుగా అడగాలని కమిటీచేసిన సిఫార్సుకు ప్రభుత్వం ఆమోదించింది. వీలైనంత త్వరలో గ్రాంట్లు యివ్వబడుతాయి.

# రేడియో

శనివారం, అక్టోబరు 2

విజయవాడ

ఉ॥ 6-55 స్వాగతం 7-0 తెలుగు వా. 7-15 మదరాసు బి వలె 8-0 ఆంగ్ల వా. 8-15 మద్రాసు ఎ వలె.

మ॥ 1-0 బి వలె 1-30 ఎ వలె 1-40 హిందీ వా. 1-50 తెలుగు వా. 3-0 మద్రాసు వలె 4-0 వనితావాణి యుగ పురుషుడు (నాటిక) బాపూ అనుచరులు స్త్రీలు (ప్రసంగం.) కొండా పార్వతీ దేవి.

సా॥ 5-30 గాంధీ ప్రవము గీతావళి ఎం. బాలమురళీకృష్ణ (ఎ. ఐ. ఆర్. వాద్యబృందము సహా) 6-0 ఉభయ కుశలోపరి 6-10 బాపూజీ (రి) టి. సూర్యకుమారి (పోర్ బందర్ కోమటింట్లో) 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామస్థుల కార్యక్రమం యమునాతరంగిణి (కావ్య గానము) రాయప్రోలు సుబ్బారావు రామనగరములో గాంధీవర్ధంతి (రూపకము) 7-0 తెలుగువా. 7-15 గ్రామ॥ కార్యక్రమం-కథానిక 7-30 నే చూసిన బాపూ (ప్రసంగము) చెరుకువాడ వెంకటనరసింహం 7-45 అమర్ గాంధీ భజన్ (రి) ఎం. ఎస్. సుబ్బలక్ష్మి, అదియకుడి రామానుజయ్యంగార్ 8-0 భారతికన్న బంగారు కల (నాటిక) బి. వి. కృష్ణారావు 8-30 మహాత్ముడు (ఆంగ్లమున గోష్ఠి) పాల్గొనువారు జి. వి. మావలంకర్, డా॥ సుశీలానాయర్, ఎస్. ఎన్. అగర్వాల్, రాజకుమారి అమృతకౌర్. 9-0 ఆంగ్ల వా. 9-15 గాంధీజయంత్యుత్సవములు (ఆంగ్లమున రేడియో సమీక్ష) 9-30 అఖిల భారత సంగీత కార్యక్రమము (ఢిల్లీనుండి రిలే) 1-0 సురేన్ చక్రవర్తి బృందం 2-0 వాడిలాల్ కవ్వారా బృందం 3-0 పంతలతో అచ్యుతన్‌నాయర్ బృందం 4-0 సముంజ్ సింగ్ రాగీ బృందం 11-0 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)

ఉ॥ 6-55 వైష్ణవ జనతో (రి) 7-0 వాద్య సమ్మేళనము 7-15 తమిళమున వా. 7-30 తిరుప్పుగళ్ సి. జి. నిత్యానందం సత్యానందం 8-0 ఆంగ్లమున వా. 8-15 త్యాగరాజ పంచరత్న కృతులు (గోష్ఠిగానం).

మ॥ 1-0 మహిళామండలి పి. భానుమతి-స్వరంజెత్తి పాడరా (స్టూ. రి.) గాంధీ సాహిత్యము సమీక్ష 1-30 (రి) 1-40 హిందీ వా. 1-50 (రి) 2-0 తమిళమున వా. 2-10 (బి) వలె 2-15 ఎ. లక్ష్మి 3-0 ఎల్. శేషి వేణువు ఎ. సుబ్బయ్య (వ) తంజావూర్ నారాయణస్వామిపిళ్లె (మృ) 4-0 మద్రాస్ (బి) వలె.

సా॥ 5-30 విజయవాడవలె 6-0 ఆంగ్లమున వా. 6-15 ప్రాంతీయ వా. 6-25 త్యాగం (తమిళమున హరికథ) 7-15 తమిళమున వా. 7-30 ప్రసంగం (రి) 7-45 ఎం. ఎం. దండపాణి దశికర్ (గా) తిరుచి బాలసుబ్బరాయులు (వ) మద్రాసు కన్నన్ (మృ) విల్వాద్రి అయ్యర్ (ఘటం) 9-0 ఆంగ్లమున వా. 9-15 పి. ఎల్. రాజకోకిలం 10-0 పాశ్చాత్య సంగీతము (రి) 10-30 ప్రసార సమాప్తి.

మద్రాసు (బి)

ఉ॥ 6-55 (ఎ) వలె 7-0 తెలుగున వా. 7-15 (రి) 7-30 బాలానందం (నిర్వహణ) న్యాపతి కామేశ్వరి 8-0 (ఎ) వలె 8-15 తిరుచిరవలె.

మ॥ 12-0 ఎస్. రాజం 1-0 గీతమాలిక (స్టూ. రి) 1-30 ఆంగ్లమున వా. 1-40 (రి) 1-50 తెలుగున వా. 2-0 వీణ-నిలయవిద్వాంసుడు 2-15 పిల్లలకు (రి) 3-0 (ఎ) వలె 4 పిల్లలకు (అం) 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 (ఎ) వలె 6-15 ప్రాంతీయ వా. 6-25 లలితగీతము రాధాబాయ్ ఖడీల్‌కర్ (వైష్ణవ జన్ తో) 6-30 గ్రామ॥ కార్యక్రమం 7-0 తెలుగున వా. 7-15 కథానిక 7-30 గాంధీజీ (ప్రసంగం) 7-45 (ఎ) వలె 9-15 మహాత్మని అడుగుజాడలలో (ఆంగ్ల ప్రసంగం) 9-30 అ॥ భా॥ సంగీత కార్యక్రమం (ఢిల్లీ రిలే) 11 ప్రసార సమాప్తి.

హైదరాబాదు

ఉ॥ 6-55 సుప్రభాత 7-0 తెలుగున వా. 7-15 శ్రీరాము దర్శనం (రూపక కార్యక్రమం) ఎస్. పద్మ, రాజకుమారి 7-45 మధురీ బెన్ ఖేర్: సునారీమైక్ (రి) డి. వి. పలూస్కర్ (రి) రఘుపతిరాఘవ, జబ్ జానకీనాధ్ 8 ఆంగ్లమున వా. 8-15 హిందీలో వా. 8-30 ఆరాధన-గాంధీజీ ప్రార్థన సభ గీతాలు.

మ॥ 12-30 బాపూజీకే ప్రియభజన్ (రి) 12-50 మరాటీ వా. 1-0 ఎస్. పద్మ, రాజకుమారి 1-30 నివేదన (రి) 1-50 తెలుగున వా.

సా॥ 5-30 బాపూ శాబాంకిత ప్రమాణాలు (ప్రసంగమాల) 5-55 స్థానిక ప్రకటనలు 6-0 కన్నడ కార్యక్రమం 6-30 శ్రద్ధాంజలి: బాపూజీ అంకితము 7-0 తెలుగున వా. 7-15 గ్రామసీమ: సర్వోదయ కార్యక్రమం. (ప్రసంగం) ఎస్. రఘువీరరావు, అస్పృశ్యతా నివారణ, గాంధీజీ కృషి (ప్రసంగం) ఎస్. వి. కృష్ణమాచారి 7-45 కన్నడమున వా. 8-0 సత్యమేవ జయతే (ఆంగ్లమున ప్రసంగం) డా॥ జి. ఎస్. మేల్కోటే, (హైదరాబాద్ ప్రభుత్వ పబ్లిక్ వర్క్సుమంత్రి) 8-20 హరిజనసేవ (హిందీ రూపకం) 9-0 ఆంగ్లమున వా. 9-15 ఉర్దూ వా. 9-30 అ॥ భా॥ సంగీత కార్యక్రమం (ఢిల్లీ రిలే) 10 ప్రసార సమాప్తి.

# క్రీడారంగం

## రామకృష్ణకు హైద్రాబాద్ ఛాంపియన్‌షిప్

హైదరాబాద్, సెప్టెంబరు 29: హైదరాబాద్ రాష్ట్ర టేబుల్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్ ఫైనల్సులో జి. రామకృష్ణ ఇవాళ డి. పి. సంపత్ (ఇండియా నెం. 5)ని ఓడించి, ఛాంపియన్‌షిప్ సంపాదించాడు. మొదటినుండి, రామకృష్ణమహా ఉధృతంగా ఆడాడు అతని డిఫెన్సు ఎంతదిట్టంగాఉందో, సంపతిమీదికి దాడికూడా అంతదిట్టంగా ప్రదర్శించాడు. రెండవ ఆటలో సంపత్ కోలుకుని తిరుగబడి అమోఘంగా ఆడాడుకాని, రామకృష్ణ విజృంభించి 21-18 లో గెలిచాడు. మూడవ ఆటలో రామకృష్ణ అతి ప్రతిభావంతంగా ఆడి సులువుగా ఆటనెగ్గాడు.

స్కోరు: రామకృష్ణ సంపత్: 21-16 21-18, 21-12.

స్త్రీల సింగిల్సులో సయద్ సుల్తానా 21-15, 17-21, 21-9, 21-13 తో మిస్ మీనాపరాంజేని ఓడించింది.

మెన్సుడబుల్సు ఫైనల్సులో అల్తాఫ్ అలీ, హరినాధ్‌లు 21-17, 16-21, 19-21, 21-19, 21-16 పాయింట్లతో రామకృష్ణ, ఉందార్కర్లపై గెలుపొందారు.

మిక్సెడ్ డబుల్సు ఫైనల్సులో అల్తాఫ్‌అలీ, మిస్ సుల్తానా కలిసి డి.పి. సంపత్, మీనాపరాంజేలనుఓడించారు.

స్కోరు: 21-16, 21-16, 21-10.

జూనియర్ సింగిల్సు ఫైనల్సులో అజాం 21-12, 21-15, 21-14 పాయింట్లతో వాసింరాజాని ఓడించాడు.

## ఐ. ఎఫ్. ఎ. షీల్డు ప్రదానం

కలకత్తా, సెప్టెంబరు 29: ఐ. ఎఫ్. ఎ., ఫస్ట్‌డివిజన్‌లీగు, కలకత్తా ఫుట్‌బాల్ లీగు మొదలైన టూర్నమెంటుల లో గెలుపొందిన వారందరికీ, ఇండియన్ ఫుట్ బాల్ అసోసియేషన్ అధ్యక్షులు పి. గుప్తా ఇవాళ ట్రోఫీలు పంచిపెట్టారు. ఈ సందర్భంలో గ్రేట్ ఈస్టర్న్ హోటలులో ఐ. ఎఫ్. ఎ. వారు విందుచేశారు.

## రోవర్సుకప్ టూర్నమెంట్

### ఇండియన్ నేవీ పరాజయం

బొంబాయి, సెప్టెంబరు 29: బి. ఇ. ఎస్. టి. స్పోర్టింగ్ క్లబ్ జట్టు ఇవ్వాళ రోవర్సుకప్ టూర్నమెంటులో, లీగు ఛాంపియన్‌లో ఇండియన్ నేవీజట్టుని అకస్మాత్తుగా 1-0 గోలులలో ఓడించి, వేసింది.

ఆట పొడుగునా కూడా నేవీజట్టు, బి. ఇ. ఎస్. టి. జట్టు ముందు కొరగాని దన్నట్లనిపించింది. బి. ఇ. ఎస్. టి. మొదటినుండి, ఎంత పట్టుదలగా ఆడిందో నేవీజట్టు ఆట అంత తిన్నగా కనపడింది. 20 వ నిముషంలో బి. ఇ. ఎస్. టి. గోలుచేసి గెలుపొందింది.

ఇంతకుముందు జరిగిన ఆటలో అలహాబాద్ జట్టు 4-2 గోలులతో గుజరాత్ ని ఓడించింది.

## డచ్చి హాకీజట్టుతో మద్రాసులో ఆట

మద్రాసు, సెప్టెంబరు 30: ఇండియాలో పర్యటనకువచ్చే డచ్చి హాకీ జట్టుతో ఒక టెస్టుమాచి మద్రాసులో జరిపించవలసిందని ఇండియన్ హాకీఫెడరేషన్‌ని అర్థించడానికి మద్రాసు హాకీ అసోసియేషన్ కార్యవర్గం ఇవాళ నిశ్చయించింది

## సింహళంలో ఎం. సి. సి. ఒకరోజు ఆట

కొలంబో, సెప్టెంబరు 29: ఆస్ట్రేలియాకు వెళ్తున్న ఎం. సి. సి. క్రికెట్ జట్టు రేపు సింహళంలోదిగి, సింహళ క్రికెట్‌జట్టుతో ఒకరోజు మాచి ఆడుతుంది. ఆట కొలంబో ఓవల్ గ్రౌండ్సులో జరుగుతుంది.

ఎం. సి. సి. జట్టులో ఈ క్రింది వారు పాల్గొంటారు: పి. బి. హెచ్. మే (కెప్టెన్) ఆర్. టి. సింప్సన్, ఎడ్రిచ్, కీర్టెక్, గ్రావనీ, విల్సన్, ఆండ్రూ, టైసన్, హార్డిట్, హోడర్, స్టాథాం, ఆపిల్‌యార్డు.

## అదనపురైళ్లు

మదరాసు, సెప్టెంబరు 29: అక్టోబరు 1 వ తేదీనుండి మదరాసు విజయవాడ, మదరాసు బొంబాయిల మధ్య అదనముగా రైళ్లు నడుపబడుతవి.

మదరాసు సెంట్రల్ నుండి విజయవాడ స్టేషనుకు ప్రతిరోజూ రాకపోకలు తిరుగుతూ ఉండే జనతాఎక్స్‌ప్రెసు నడువగలదు. మదరాసునుండి యీ బండి ప్రతిరోజూ మధ్యాహ్నం 12-50 గంటలకు బయలుదేరుతుంది. విజయవాడ నుంచి వచ్చేబండి సా॥ 5-10 గంటలకు సెంట్రలుకు వస్తుంది. ఇదేబండి వారానికి మూడురోజులు మదరాసు ఢిల్లీల మధ్య జనతా ఎక్స్‌ప్రెస్ గా మారి నడువగలదు-ఢిల్లీ జనతా ఎక్స్‌ప్రెస్ గా నడిచేబండి ప్రతిసోమ బుధ శుక్రవారములలో మధ్యాహ్నం 12-50 గం. మదరాసు సెంట్రల్ నుండి బయలుదేరి వెళ్ళగలదు. మంగళ, గురు, శనివారములలో సా. 5-10 గంటలకు మదరాసుకు తిరిగి రాగలదు.

ప్రస్తుతం మదరాసు బొంబాయిల మధ్య వారానికొకసారి నడిచే జనతా ఎక్స్‌ప్రెస్ యిటుపైని వారానికి రెండుసార్లు నడువగలదు. ఈ బండి మదరాసునుంచి సోమ, శనివారములలో మధ్యాహ్నం 1-50 గంటలకు బయలుదేరుతుంది. బొంబాయినుండి వచ్చేబండి సోమ గురువారములందు మధ్యాహ్నం 3-20 గంటలకు రాగలదు.

# మద్రాసు వార్తలు

## శ్రీ రామకృష్ణ మఠం

మదరాసు, సెప్టెంబరు 29: శ్రీ రామకృష్ణ మఠంవారు మైలాపూరులో అక్టోబరు 3 వ తేదీ నుండి 7 వ తేదీ వరకు దసరా ఉత్సవాలను ఆచరిస్తారు. కలకత్తాలో తయారైన దేవి విగ్రహమును ప్రతిష్ఠించి షోడశ ఉపచారాలతో పూజలు జరుపబడును. పూజా సందర్భం ప్రతిరోజూ విఖ్యాత గాయకుల సంగీతము, భజనలు జరుగగలవు.

## చెన్నపురి ఆంధ్ర ముదిరాజ సంఘం

పైసంఘ నూతన కార్యవర్గముగా యీ క్రిందివారు ఎన్నుకోబడ్డారు. అధ్యక్షుడు కొంగితల రాఘవయ్యరాజు ఉపాధ్యక్షుడు కొంగితల రాములు రాజు కార్యదర్శి ఆతూర్కి దానయ్య రాజు సహాయ కార్యదర్శి పాతూరి రంకయ్యరాజు, కోశాధిపతి తిరుకూరి వెంకయ్యరాజు - మరి 6 గురు కమిటీ సభ్యులుగా ఎన్నికైనారు.

## ఆంధ్ర రాష్ట్రావతరణ వార్షికోత్సవం

మదరాసు, సెప్టెంబరు 29: కలకల కణ్ణన్ శెట్టిగారి హైస్కూలు ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజము యాజమాన్యమున ఆంధ్ర రాష్ట్రావతరణ ప్రథమ వార్షికోత్సవము అక్టోబరు 1 వ తేదీ సాగేక పాఠశాలా భవనమున శ్రీయుతులు వేణుగోపాలరావు డిప్యూటీ మేయరుగారి అధ్యక్షతను జరుపబడును. ఆంధ్ర విజ్ఞానసమితి వారిచే కొన్ని నాటకముల దృశ్యములు కూడా ప్రదర్శింపబడగలవు.

ఆంధ్ర యువక వ్యాయామ సంఘం యాజమాన్యమున అక్టోబరు 1 వ తేదీ సా 5 గం. గోవిందప్ప నాయకన్‌వీధి నెం 67 గృహంలో ఆంధ్ర రాష్ట్రావతరణ దినోత్సవం జరుపబడుతుంది. శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు అధ్యక్షత వహిస్తారు.

## మద్రాసులోని ఆంధ్ర హరిజనులు

మదరాసు, సెప్టెంబరు 27: మదరాసు ఆంధ్ర హరిజన కేంద్ర సంఘ కార్యదర్శి యిటుల వ్రాస్తున్నారు.

మద్రాసు నగరమందు వేలకొలది ఆంధ్ర హరిజనులు సాంఘికంగా, ఆర్థికంగా, విద్యా, ఉద్యోగవిషయములలో ఎక్కువహీనస్థితిలో వున్నారు. పైఇబ్బందు లన్నియు సాధించుటకు గాను, మద్రాసు నగరమందుండు హరిజన సంఘముల ఐకమత్యతివిధాన మద్రాసు ఆంధ్ర హరిజన కేంద్ర సంఘమును 2-5-1954 న మద్రాసు టి. నగరు, గాంధీపురమునందు స్థాపింపబడినది. మద్రాసునందు యున్న అన్ని ఆంధ్ర హరిజనసంఘములు పై కేంద్ర సంఘమున అనుబంధ సంఘములుగాచేరి హరిజన అభివృద్ధికి సహాయపడుదురని కోరుచున్నాము.

## వరదబాధితులకు విద్యార్థుల విరాళం

రాజమండ్రి, సెప్టెంబరు 25: రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్సుకళాశాల సాంఘిక సేవాసమితి సభ్యులుఅయిన విద్యార్థులు, విద్యార్థినులు ఈశాన్య భారత వరదబాధితుల నిధి నిమిత్తం పురవీధులందు తిరిగి 800 రూపాయలు, 225 బట్టలు సేకరించారు. వీరు పల్లెలలో కూడా సేకరించేప్రయత్నాలు చేస్తున్నారు.

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 30:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-క ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 58-4-0
పెట్లొబంగారం తులం రు. 8-2-0
మూస బంగారు రు. 86-4-0
పీమవెండి తులం100కి రెడీ రు. 159-8-0
చిల్లర ధర రు. 1-10-6

వేరుశనగ

(531 పౌ॥ 1-క ఎప్పుడోసహా కిట్టంలు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 111-114
వేరుశెనగనూనె ఎప్పుడిల్లర టిలో 3% (500పౌ.) రెడీ చిల్లరధర రు. 220-0-0
కొంకోయనూనె (37½ పౌనులు)
అంబుమార్కు రు. 30-8-9
ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా 30-8-9
రాజా రు. 30-0-9

ఆముదం

తిరుపత్తూరు (500 పౌ) రు. 185-0-0

పంచదార

జపాన్ (56 పౌ) 24-8-9
క్యూబాన్ (100 పౌ॥) 36-8-9
క్యూబాన్ (250 పౌ॥) 90-8-9

## బొంబాయిమార్కెట్

బొంబాయి, సెప్టెంబరు 30: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 రు.) | 157-12-0 |
| బంగారం (1 రు.) | 87-2-0 |
| సావరిన్ | 57-10-0 |

కలకత్తా మార్కెట్ ధరలు: 158-9-0 87-10-0; 58-4-0.

## న్యూయార్కు దూది

అక్టోబరు వాయిదాధరలు

న్యూయార్కు, సెప్టెంబరు 29. న్యూయార్కు కాటన్ మార్కెట్ ధరలు నేడు ఈ క్రిందివిధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 35.32. |
| నేటి ముగింపు ధర | 35.18. |

(1 వ పేజీ తరువాయి)

చేయబడింది. కర్నూలు వద్ద తుంగభద్రపై వంతెన నిర్మాణానికి తగు ప్రయత్నాలు జరుగుతున్నవి.

ద్రోణాచలంనుంచి పుణ్యక్షేత్రమైన శ్రీశైలానికి రోడ్డు నిర్మించబడుతుంది. ఇందుకు రూ. 22 లక్షల ఖర్చు అవుతుంది.

కడపలో పెన్నానదవద్ద పెన్నానదిపై వంతెన నిర్మింపబడుతుంది. ఇందుకు రూ. 20 లక్షల ఖర్చు అవుతుంది.

ఏజన్సీ ప్రాంతాల్లో రోడ్ల నిర్మాణం విషయమైకూడా తగు శ్రద్ధ చూపబడుతోంది. రాజమండ్రి నుంచి లొల్ల వరంద్వారా చింతూరుకు, చింతూరునుంచి కుక్కునూరుకి రోడ్లు వేయటానికి రెండు స్కీములు అమలు జరుపబడుతవి. వీటి అంచనా ఖర్చు రూ. 33 లక్షలు.

## రైల్వే మార్గాలు

రేణిగుంట గూడూరు రైల్వే మార్గాన్ని బ్రాడ్‌గేజ్ లోకి మార్చటానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది. ఇందుకు రూ. 209 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా వేయబడింది. 1954-55 లో రూ. 11 లక్షల మొత్తం ఈ నిమిత్తమై కేటాయింపబడింది. పని ఆరంభమైంది.

బెజవాడ స్టేషన్‌కు మొత్తం రూ. 80 లక్షుల ఖర్చులో మరమ్మతులు చేయబడుతవి.

## రేవులు

జాతీయ రేవు సంస్థ 1953 లో చిన్న రేవులకు క్రింది అభివృద్ధి స్కీములను మంజూరు చేసింది.

| | |
|---|---|
| కాకినాడ | రూ. 2,75,000 |
| మచిలీపట్నం | రూ. 1,65,000 |
| | రూ. 4,40,000 |

## రేడియో

విజయవాడలో త్వరలో 20 కి వా. మీడియం ట్రాన్స్‌మిటర్ నెలకొల్పబడుతోంది. కర్నూలులో ఒక రేడియో కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని అనుకుంటున్నాం.

## జాతీయ ప్రణాళిక ఋణం

కేంద్రప్రభుత్వం దేశ ప్రణాళిక నిర్వహణకై జాతీయ ప్రణాళిక ఋణానికి చందా లివ్వవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేసింది. ఆంధ్రరాష్ట్ర ప్రజలు రూ. 5 కోట్లకుపైగా ఋణా లిచ్చి, తమ దేశ భక్తిని, కార్యదీక్షను ఋజువు పరచారు.

ఇలా వివిధ రంగాల్లో ఆంధ్రరాష్ట్రం త్వరత్వరగా పురోగమిస్తోంది. కొత్తవార్లు లొడ్డుతోంది. పాత రాష్ట్రాలు సైతం 'ఆంధ్ర' కేసి చూస్తున్నవి. ముక్కోటి ఆంధ్రుల మనుగడ స్వప్నమైన విశాలాంధ్ర ఏర్పడటంతో భారతదేశంలో ఆంధ్రజాతికి అద్వితీయ స్థానం ఏర్పడుతుంది. ఆ శుభ సంఘటన కోసం ఆదరం కలసి పాటుపడుదాం.

# కష్టజీవుల కల్పవృక్షం పోస్టాఫీసు

పోస్టాఫీసు ముఖ్యంగా ఉత్తరాలు బట్వాడా చేస్తున్నప్పటికీ, దానికి ఇంకా ఇతర పనులు కూడా వున్నాయి. అవి నిర్వర్తించే ఇతర పనుల్లో ముఖ్యమైనవి చిన్న పెట్టుబడిదారులకు నిలవ సౌకర్యాలు కలుగజేయడం. నేడు 48 లక్షల ప్రజలకు సేవింగ్సు బ్యాంకు ఖాతాలున్నాయి. 217 కోట్ల, 70 లక్షల రూపాయలు మొత్తం నిలవ వుంది. ఇంతేగాక, 15 లక్షల డిపాజిట్లు, సేవింగ్సు బ్యాంకు ఖాతాల వల్ల పోస్టాఫీసుల్లో 120 లక్షల రూపాయలు నిలవ వున్నాయి. ఏమైనా ఇవి 25 కోట్ల రూపాయలు విలువగల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లకుగాను అమ్ముతున్నాయి. 1952-53వ సంవత్సరంతో గడువు ముగిసిన నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లకు డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లకుగాను మొత్తం 12 కోట్ల రూపాయలు తపాలాశాఖ పెట్టుబడిదారులకు చెల్లించింది. 560 లక్షల మనీ ఆర్డర్ల ద్వారా, దేశంలోని వివిధ భాగాలకు 198 కోట్ల రూపాయలు పంపించింది.

ప్రజల్లో పొదుపుచేసే అలవాటును పెంపొందించడానికి పోస్టాఫీసుల్లో ఈ నిలవ సౌకర్యాలు కల్పించబడ్డాయి. పెద్ద పెద్ద వ్యాపారస్థులకు, లాభాలు తీసే ఉద్దేశం వున్నవారికి ఆకర్షణీయంగా లేకుండా ఈ సేవింగ్సు బ్యాంకు నిబంధనలు చేయబడ్డాయి. వారానికి ఒకసారి మాత్రమే సేవింగ్సు బ్యాంకునుండి డబ్బు తీసుకోడానికి వీలవుతుంది. గత కొన్ని సంవత్సరాలుగా సేవింగ్సుబ్యాంకు ఖాతాలసంఖ్యలో కనబడిన వృద్ధి ప్రజలు పొదుపు చేస్తున్నారనడానికి, ప్రజలకు ప్రభుత్వ విధానాల్లో విశ్వాసముందనడానికి గొప్ప నిదర్శనం.

పోస్టాఫీసుల్లో సేవింగ్సు బ్యాంకు సౌకర్యాలు 1882వ సంవత్సరంలో కలుగజేయబడ్డాయి. ఒక సంవత్సరంలో 39,121 ఖాతాలవల్ల 27,96,000 రూపాయలు నిలవచేయబడ్డాయి. 1870 సంవత్సరం నుంచీ అమలులో వున్న జిల్లా సేవింగ్సు బ్యాంకులు మూసివేయబడ్డాయి.

## నగదు సర్టిఫికేట్లు

35 ఏళ్ళవరకు పోస్టాఫీసుల్లోని సేవింగ్సు బ్యాంకులో ఏమీ మార్పు రాలేదు. కాని 1917లో, మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజుల్లో ఐదేళ్ల తపాలానగదు సర్టిఫికెట్లు ఏర్పాటు చేయబడ్డాయి. వీటివల్ల మొట్టమొదటి సంవత్సరంలోనే 10 కోట్ల రూపాయలు వసూలయాయి.

మొదటిరోజుల్లో యీ పథకం విజయం గాంచినప్పటికీ తరువాత రోజుల్లో ఇది ప్రజాదరణ పొందలేకపోయింది. చివరకు 1947లో యీ పథకం రద్దుచేయబడింది.

రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజుల్లో ఇదివరకటి నగదు సర్టిఫికెట్లుఇచ్చే వడ్డీకంటే ఎక్కువ వడ్డీనిచ్చే డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికెట్లు ఏర్పాటు చేయబడ్డాయి. కాని 1948వ సంవత్సరం అక్టోబరు 1వ తారీఖున వీటిబదులు నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు అమలులోకి వచ్చాయి. యుద్ధం రోజుల్లో ఇవి ప్రజాదరణ పొందినా 1946-47 సంవత్సరంలో మాత్రం వీటిపై పెట్టుబడి తగ్గింది. 1948 సంవత్సరం జూన్‌మాసంలో ఏడేళ్ల పదేళ్ల నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లను ఏర్పాటుచేసింది. యీ సర్టిఫికెట్లను అమ్మడానికి నూటికి రు 1-4-0 వంతునకమీషన్‌పై దేశంలో పలుచోట్ల ఏజంట్లు నియమింపబడ్డారు. వీటి అమ్మకవిషయాలను పరిశీలించేందుకై ఒక కమిషనర్ కూడా నియమితులయ్యాడు. నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు అమ్మకం 10 ఏళ్ళ క్రితమే అమలులోకి వచ్చింది. క్రింది మధ్యతరగతి ప్రజానీకం యీ సర్టిఫికెట్లను ఎక్కువగా కొని ఆదరిస్తున్నారు.

పోస్టల్ సేవింగ్సు బ్యాంకులు పని చేసే విధానం పరిశీలించి, దానిని అభివృద్ధి చేయడానికి, ప్రజలకు యింకా అదనంగా సౌకర్యాలు కలుగచేయడానికి సూచనలు యిచ్చేనిమిత్తం తపాలాశాఖకు చెందిన ఉద్యోగులతో ఒక సంఘం 1950వ సంవత్సరములో నియమింపబడింది యీ సంఘం సిఫార్సుల ప్రకారం ప్రతివ్యక్తి 15,000 రూపాయలవరకు సేవింగ్సు బ్యాంకులో నిలవచేసుకోడానికి వీలు కలిగించబడింది. ఉమ్మడి ఖాతాలపై 20,000 రూపాయలవరకు కూడా నిలవచేసుకోవచ్చు. పెట్టుబడిమీద ప్రభుత్వం ఇచ్చే వడ్డీ కూడా ఎక్కువ చేయబడింది. ప్రస్తుతం 10,000 రూపాయల మొత్తంవరకూ నూటికి 1-8-0 వడ్డీ లభిస్తుంది.

చిన్న పెట్టుబడిదారులకు పోస్టాఫీసులు బ్యాంకర్లుగా పనిచేస్తున్నాయి కదా! సేవింగ్సు బ్యాంకు లెక్కల ప్రకారం అవి క్రింది మధ్యతరగతి ప్రజానీకపు ఆర్థిక స్థితిని గణించడానికి కూడా ఉపకరిస్తాయి. 1945-46వ సంవత్సరంలో సేవింగ్సు బ్యాంకులలో 85 కోట్ల రూపాయలు అదనంగా నిలవచేయబడ్డాయి. అంటే యుద్ధానికి పూర్వం నిలవచేయబడిన పెద్దమొత్తంమీద నూటికి 40 వంతులు పెరిగిందన్నమాట. అలాగే 1946-47వ సంవత్సరంలో 27 కోట్ల రూపాయలు అదనంగా నిలవచేయబడింది. దీనికి కారణం మధ్యతరగతి ప్రజానీకం ఎక్కువ జీతం సంపాదించడం. తరువాత అవసరవస్తువులుకూడా దొరక్కపోవడం వల్ల డబ్బు ఖర్చుచేయడానికి అవకాశాలులేకపోవడం.

సేవింగ్సుబ్యాంకు సౌకర్యాలు కలుగజేయడం, సేవింగ్సు సర్టిఫికెట్లు అమ్మడమేగాక, ఇంకా మనీఆర్డర్లుపంపడం, పోస్టల్ ఆర్డర్ లివ్వడం, వి. పి. పోస్టు ద్వారా డబ్బువసూలుచేయడం-లాంటి పనులుకూడా పోస్టాఫీసులు నిర్వర్తిస్తూ ఉంటాయి. సగటు ప్రతిఏడాది 5,60,00,000 మనీఆర్డర్లు పోస్టాఫీసుల్లో కట్టబడుతున్నాయి. 198 కోట్ల రూపాయలు వీటి ద్వారా వసూలు చేయబడి చిరునామా దారులకు అందజేయబడుతున్నాయి. దేశంలోని మారుమూలల్లోకూడా తపాలా సౌకర్యాలు ఏర్పాటు చేయబడడం, ప్రజల కొనుగోలుశక్తి వృద్ధికావడం, వారి పొదుపరితనం అధికంకావడంవల్ల బ్యాంకరుగానూ, పెట్టుబడిదారుగానూ పోస్టాఫీసు నిర్వహించే పాత్ర అతిప్రముఖమైనదనడానికి ఏటీసందేహమూ లేదు.

# తపాలాబిళ్లల చరిత్ర

19వ శతాబ్దం మధ్య భాగంలో పోస్టాఫీసు చరిత్రలో తొలి అధ్యాయం ముగిసి మరొక క్రొత్త అధ్యాయం ప్రారంభమైనది. 1851వ సంవత్సరంలో "కోర్టిని నివేదిక" ప్రచురించబడింది. 1853వ సంవత్సరంలో తొలిసారిగా రైళ్ళు అమలులోకి వచ్చాయి. అదే సంవత్సరంలో డా॥ ఓషాగ్ నెస్సీచే కనిపెట్టబడిన ఎలక్ట్రిక్ టెలిగ్రాఫ్ పద్ధతి ప్రవేశపెట్టబడింది. ఒకచోటనుంచి మరొకచోటుకు తీవ్ర త్వరగా వార్తను అందించడానికి ఈ ఎలక్ట్రిక్ టెలిగ్రాఫ్ విశేషంగా తోడ్పడింది.

1854 అక్టోబరు 1వ తేదీన దేశవ్యాప్తంగా మొదటసారి తపాలా బిళ్ళలు జారీచేయబడ్డాయి. ఆ సంవత్సరంలోనే పోస్టలు విధాన నిర్వహణ బాధ్యత పోస్టాఫీసు డైరెక్టరు జనరలుకు అప్పగించబడింది. పోస్టు ఉత్తరాలు, బంగీలు మొదలైనవాటి సేకరణ, బట్వాడాలకు సంబంధించి కొన్ని నిబంధనలు ఒక మాన్యుయల్ రూపంలో ప్రకటించబడ్డాయి.

## రైల్వేల ఉపయోగం

రైల్వేల కంపెనీలవారు ఉత్తరాలు, బంగీలను ఉచితంగా చేరవేయాలని 1858 సెప్టెంబరు 9వ తేదీన లార్డు డల్‌హౌసీ ఒక ఉత్తరువు జారీచేశారు. అయితే 1854వ సంవత్సరంలో రైలు మార్గం 100 మైళ్ల పొడవుమాత్రమే వున్నది. ఆర్. యమ్. యస్. సర్వీసు ఆ సంవత్సరంలోనే ప్రారంభించబడింది. అదే సంవత్సరంలో విదేశీ తపాలా సర్వీసుకూడ ప్రారంభమైనది. ప్రభుత్వం బ్రిటనునుంచి అలెగ్జాండ్రియా ద్వారా ఇండియాకు ఉత్తరాలను, బంగీలను నౌకలలో చేరవేయడానికి పి. అండ్ ఓ. స్టీమ్ నావిగేషన్ కంపెనీతో ఒక ఒప్పందాన్ని కుదుర్చుకొన్నది. 1854 జూలై 7వ తేదీన ఈ సర్వీసు ప్రారంభించబడింది. ఉత్తరాలకు, బంగీలకు పోస్టుబిళ్ళలను కొని అంటించే పద్ధతికూడ అప్పుడే ప్రవేశపెట్టబడింది. బేరింగ్ ఉత్తరాలకు (తపాలబిళ్ళలు అంటించకుండా పోస్టు చేయబడినవి) అవి చేరినచోట్లో రెట్టింపు చార్జీ వసూలుచేయబడేది.

పోస్టలు విధానం పైవిధంగా పునర్నిర్మించబడిన తర్వాత మొదటి 10 సంవత్సరాలలోను బ్రిటిషువారి వాణిజ్య ప్రయోజనాలు, సైనికావసరాలకు బట్టే పోస్టలు సౌకర్యాలు అభివృద్ధి చేయబడ్డాయి. మద్రాసునుంచి బొంబాయికి 886 మైళ్లు. మద్రాసునుంచి బొంబాయికి తపాలు చేరవేయడానికి నెల్లూరు, ఒంగోలు, ముల్కాపూర్, సికింద్రాబాద్, గుల్బర్గా, షోలాపూర్ పూనా, ఖాండా, పానెవల్ మీదుగా మార్గం ఏర్పరచబడింది. మొత్తం 72 అంచెలమీద తపాలు చేరవేయబడేది. ఆ మార్గంలో 6 పోస్టాఫీసులు, 9 తపాలాసేవనులు వుండేవి. ఒకచోటునుంచి మరొకచోటుకు తపాలును రన్నర్లు చేరవేస్తూ వుండేవారు. ఆవిధంగా మద్రాసునుంచి బొంబాయికి తపాలు చేరడానికి 10, 12 రోజులు పట్టేది. ఆవిధంగా మధ్యలో మకాములు చేయడానికి ప్రత్యేక బంగళాలు వుండేవి. పోస్టలు రన్నర్లు గంటకు సగటున 4½ మైళ్లు నడిచేవారు.

తొలి రైలుమార్గం 1853 ఏప్రిల్ 16వ తేదీన (బొంబాయినుంచి థానాకు 30 మైళ్లు) తెరువబడింది. పదిసంవత్సరాల అనంతరం రైళ్లద్వారా 2,478 మైళ్లు, గుఱ్ఱములు. బళ్లుద్వారా 5,156 మైళ్లు, రన్నర్లద్వారా 38,858 మైళ్లు నౌకలద్వారా 5,137 మైళ్లు తపాలు చేరవేయబడేది. 1863లో మద్రాసునుంచి బొంబాయికి తపాలు చేరడానికి 5 రోజులు పట్టేది. 1871వ సంవత్సరం నాటికి ఇండియాలో 5,000 జనాభా గల ప్రతి నగరంలోను ఒక పోస్టాఫీసు చొప్పున పోస్టాఫీసులు నెలకొల్పబడ్డాయి. అంతకంటె ఎక్కువ జనాభాగల పట్టణాలలో "ఉత్తరాల పెట్టెలు" నెలకొల్పబడ్డాయి. అక్కడికి చేరువలోగల పోస్టాఫీసుకు చెందిన బంట్రోతులు ఆ తపాలపెట్టెలలోని ఉత్తరాలను పోస్టాఫీసులకు అందించేవారు.

## విదేశ తపాలు

బ్రిటను, బొంబాయిలమధ్య వారం వారం తపాల సర్వీసును నడపడానికి 1867లో పి. అండ్ ఓ స్టీమ్ నావిగేషన్ కంపెనీతో 11 సంవత్సరాల ఒప్పందం ఒకటి కుదుర్చుకోబడింది. వివిధ దేశాలకు పంపబడే తపాలుకు రేట్లనునిర్ణయించడానికిగాను ఇండియా ప్రపంచ పోస్టలు యూనియన్‌లో చేరడానికి 1875లో నిర్ణయించింది. 1876లో ఇండియాకు ఆ యూనియన్‌లో సభ్యత్వం ఇవ్వబడింది.

1877వ సంవత్సరంలో వి. పి. పద్ధతి ప్రవేశపెట్టబడింది. ఒక వస్తువు ఒక చిరునామాదారుకు వి. పి. గా పంపితే ఆ వస్తువుయొక్క ఖరీదును పోస్టాఫీసువారు ఆ చిరునామాదారు వద్ద వసూలుచేసి ఆ వి. పి. ని పంపినవారికి అందజేస్తారు. అదే సంవత్సరంలో పోస్టల్ వస్తువులను ఇన్సూరుచేసే పద్ధతికూడ ప్రవేశపెట్టబడింది. ఈ పద్ధతులు ప్రవేశపెట్టబడినతర్వాత నగరాల వెలుపల నివసించేవారు తమకు కావలసిన వస్తువులను నగరానికి వెళ్లి కొనవసరం లేకుండా ఆ వస్తువులను వి. పి ద్వారా తెప్పించుకోడానికి అవకాశం ఏర్పడింది.

## మనిఆర్డర్ల పద్ధతి

1880వ సంవత్సరంలో మనిఆర్డర్ల పద్ధతి ప్రవేశపెట్టబడింది. అప్పటివరకూ ప్రభుత్వ ట్రెజరీలలో మనీ ఆర్డర్లను పుచ్చుకోవడం, బట్వాడా చేయడం జరిగేది. ప్రభుత్వ ట్రెజరీలు మొత్తం 283 మాత్రమే వున్నందున ప్రజలకు చాలఇబ్బందిగా వుండేది. ఆ సంవత్సరంలో సొమ్ము పంపేవారు స్వయంగా పోస్టాఫీసుకు వెళ్లకుండా మనీఆర్డర్లద్వారా సొమ్ము పంపే ఏర్పాట్లు మొత్తం 5,500 పోస్టాఫీసులలో చేయబడ్డాయి.

## సంస్థానాల చేరిక

తపాలా విస్తరణ కార్యక్రమం దినదినాభివృద్ధిపొందుతున్నందున బ్రిటిష్ ఇండియా అధీనంలోలేని అనేకప్రాంతాలు, సంస్థానాలు క్రమక్రమంగా ప్రత్యేక ఒప్పందాలు చేసుకొని అందులో చేరాయి. 1884లో పాటియాలాసంస్థానం చేరింది. తర్వాత 16 సంవత్సరాలలో మిగతా సంస్థానాలన్నింటికి బ్రిటిషుపోస్టలు విధానం విస్తరించబడింది.

1882లో పోస్టాఫీసులలో సేవింగ్సు బ్యాంకు పద్ధతి ప్రవేశపెట్టబడింది. ఎక్స్‌ప్రెస్ డెలివరీ, సర్టిఫికేట్ ఆఫ్ పోస్టింగుపద్ధతులు 1897-98లో ప్రవేశపెట్టబడ్డాయి.

1883 డిసెంబరు 1వ తేదీన టెలిగ్రాముల పద్ధతి 255 పోస్టాఫీసులలో ప్రవేశపెట్టబడింది. 20 సంవత్సరాల తర్వాత 2,029 పోస్టాఫీసులలో టెలిగ్రాఫు సౌకర్యాలు ఏర్పాటు చేయబడ్డాయి. 1914 ఏప్రిలు 1వ తేదీన తపాలాశాఖ, తంతిశాఖ కలిపివేయబడ్డాయి.

## సైనిక తపాలా కార్యాలయాలు

తంతి తపాలశాఖలు కలిపివేయబడిన కొద్ది రోజులకే మొదటి ప్రపంచయుద్ధంవచ్చింది. విదేశాలలోవున్న భారతీయసైనికులకు తపాలు సౌకర్యాలు ఏర్పాటుచేయవలసివచ్చింది. అందువల్ల బొంబాయిలో ఒక "బేస్ పోస్టాఫీసు" నెలకొల్పబడింది. అదేవిధంగా విదేశాలలోని భారతీయసైనిక కేంద్రాలలో ఒక్కొక్క బేస్ పోస్టాఫీసు నెలకొల్పబడింది. 1917వ సంవత్సరంలో యుద్ధ ఋణపత్రాలను, 5 సంవత్సరాలవగడు సర్టిఫికేట్లను విక్రయించడం పోస్టాఫీసులలో ప్రారంభించబడింది.

## తొలి పోస్టల్ ఉద్యోగుల సమ్మె

ప్రపంచ యుద్ధం ముగిసినతర్వాత రాజకీయ కల్లోలాలు బయలుదేరి వాటి దుష్ఫలితాలు పోస్టలు ఉద్యోగులమీద ప్రసరించాయి. పోస్టలు స్టాఫ్ యూనియను అప్పటికి మూడుసంవత్సరాల క్రిందట నెలకొల్పబడింది. 1919-20వ సంవత్సరంలో జీతాలస్కేళ్లు సవరించబడ్డాయి కాని అవి పోస్టలు ఉద్యోగులకు సంతృప్తి నివ్వలేదు. పోస్టలు ఉద్యోగులు సమ్మెచేయడానికి నిశ్చయించారు. దేశమంతటా పోస్టలు ఉద్యోగులు సమ్మెలుచేశారు. వాటన్నింటిలోకి పెద్ద సమ్మె బొంబాయిలో జరిగింది. అక్కడి పోస్టలు ఉద్యోగులు 135 రోజులపాటు సమ్మెచేశారు. రాజకీయ పరిస్థితి కొంతచక్కబడడంతో, ఈ పోరాటం శాసనసభల ద్వారా సాగడం మొదలు పెట్టింది.

## విమాన టపా

1929 ఏప్రిల్ 26వ తేదీన బ్రిటను ఇండియాల మధ్య విమానటపా సర్వీసు ప్రారంభించబడింది. ఆరు మాసాల అనంతరం భారత విమాన కంపెనీల ద్వారా ఢిల్లీ-కరాచీ విమాన టపా సర్వీసు ప్రారంభించబడింది. 1936లో "ఇండియన్ పోస్టల్ ఆర్డర్లు" పద్ధతి ప్రవేశపెట్టబడింది. 1937-38లో "ఎంపైర్ ఎయిర్ మెయిల్ స్కీము" ప్రారంభం కావడంతో విదేశీ తపాలు విషయంలో కొన్ని మార్పులు జరిగాయి.

## సైనిక తపాలా సర్వీసు

1939లో రెండవ ప్రపంచయుద్ధం రావడంతో కొన్ని క్రొత్త సమస్యలు ఉత్పన్నమైనాయి. 1941 మార్చి నెలలో భారత సైనిక ప్రధాన కార్యాలయంలోని క్వార్టర్ మాస్టర్ జనరల్ శాఖలో ఒక పోస్టలుశాఖ నెలకొల్పబడింది. సైనికులకు అప్పటికే సంతృప్తి కలుగలేదు.

యుద్ధకాలంలో పోస్టాఫీసులకు పని విపరీతంగా పెరిగిపోయింది. సిబ్బంది కూడ ఎక్కువ చేయబడింది. యుద్ధం చివరలో ఇండియాలో రాజకీయ పరిస్థితి మరీ అధ్వాన్నమై కార్మిక వర్గాలలో ఆందోళన ఎక్కువైంది. 1946 జూలై 11వ తేదీన తంతి తపాలశాఖకు చెందిన పోస్టుమెన్, లాయిన్ల్యాగేదు సిబ్బంది దేశంలో పలుచోట్ల సమ్మెచేశారు. ఆ సమ్మెకాలంలో అస్సాం, ఒరిస్సా ప్రభుత్వాలకు తపాలు బట్వాడా కాలేదు. అప్పుడు మద్రాసు, బొంబాయి, కలకత్తాలవంటి నగరాలలో "విండో డెలివరీ" (పోస్టాఫీసు కిటికీవద్ద తపాలు బట్వాడా చేయడం) ప్రవేశపెట్టబడింది. కొంతమంది పురజనులు, సైనికుల సహాయంతో పోస్టాఫీసులను అతి కష్టంమీద నడిపారు. సమ్మె దేశమంతటా వ్యాపించింది కాని సమ్మెదారులకు తగినబలం చేకూరనందున ఒక్కొక్కరే క్రమంగా తిరిగి పనులలో చేరారు.

## కోట, కొత్తపాలెంగ్రామాలకు విద్యుచ్ఛక్తి

కోట, సెప్టెంబరు 27 : గూడూరు తాలూకా కోట, కొత్తపాలెం గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయవలసిందిగా ప్రభుత్వం ఉత్తర్వు చేసిందనీ, కడివేదు గ్రామానికి ఇదివరకే మంజూరైందనీ, త్వరలో ఈ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రభుత్వం అనుమతించాలనీ కోట పంచాయతీ బోర్డు అధ్యక్షులు పల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారు వ్రాస్తున్నారు.

